# ఇదే ప్రపంచం

[సాంఘిక నాటకం]

రచన

హైన్సుపోలా

ప్రచురణ కర్త

పి. వి. ఆర్. రెడ్డి.

మద్రాసు - 17.

ప్రథమ ముద్రణ : 1957 జనవరి
1000 ప్రతులు
వెల : 1-4-0.

ప్రాప్తిస్థానం
నెం 5. సత్యనారాయణ వీథి,
మద్రాసు-17.

ముద్రణ
ఎం. వి. యస్. ప్రెస్
21. పెరుమాళ్ మొదలి వీధి,
సౌకార్ పేట, మద్రాసు - 1.



నా హృదయారాధకుడు నా జీవిత ప్రభాత

సిక్తుడైన పి. యస్. రెడ్డిగారి నిర్యాణానికి

అశ్రునేత్రావేశంతో సమర్పించుకొన్న

నా ప్రథమ కానుక.

# ఇందులో పాత్రలు



| | |
|---|---|
| వెంకట్రామిరెడ్డి | భూస్వామి |
| గున్నయ్య | వెంకట్రామిరెడ్డి స్నేహితుడు |
| విశ్వనాధరెడ్డి | వెంకట్రామిరెడ్డి కుమారుడు |
| కోటయ్య | గుమాస్తా |
| శాంతయ్య | పెళ్లి పెద్ద |
| నారయ్య | పనిమనిషి |
| కాంతమ్మ | నారయ్య కుమార్తె |
| గండడు, పుల్లడు | వెంకట్రామిరెడ్డి అదుపులో రౌడీలు |
| సుబ్బారెడ్డి | పేదరైతు |
| గోవిందరెడ్డి | సుబ్బారెడ్డి కుమారుడు |
| వీరయ్య | కష్టజీవి. |

కాలం : ఈనాడే

రంగులు : నాలుగు

ప్రదర్శనం : మూడు గంటలు.

# నా మనవి

ఆంధ్రనాటక కళా సోదరులకు, పఠిత మిత్రులకు, విశాల హృదయంతో కృషిజేసిన నా కవితా పుష్పాన్ని అనుజ్ఞజూపి, ఆదరించి, ఆనందించ గలరని ప్రగాఢనీయంగా విశ్వసిస్తున్నాను.

అగాంతమైన జగతిలో మానవ హృదయాక్రందన వైపరీత్యమే, మహోజ్జ్వల కవితాసృష్టి. నిత్యసత్యాలను నిరూపణజేసే సాత్వికత్వమే నిజమైన కళాసౌందర్య శిల్ప సంస్కారమౌతుంది. సంఘ జీవితంలో రచయిత ఏకీభవించినప్పుడే కళారాధనలో కృత కృత్యుడు కాగలడు.

నేటి వాతావరణంలో తలఎత్తి సవాలు జేస్తున్న దౌష్ట్యం, ఈర్ష్య, మోసాలను మానవత్వంతో పరిశీలిస్తే కవికలం అశ్రుధారకు గురికాకతీరదు. యీ ధూర్తలోకపు నిరంకుశాధికారానుభూతికి నిస్పృహతో, నీరసంతో కృంగి కుళ్ళి కృశిస్తున్న పేద ప్రజల మనశ్శాంతి కొరకు కవికలం ఆయుధమై అధర్మాల్ని ఎదిరించి, సమానత్వ శాంతిని నిర్మలత్వపు కాంతిని రూపొందించి తీరుతుంది.

శృంగారాన్ని చిత్రించి అర్ధరహితమైన అంబర సౌఖ్యాన్ని ప్రబోధించే సాహిత్యం పూర్వంనుండి మానవుల్ని భ్రమింప జేస్తూనే వుంది. కాని వాతావరణాన్ని చిత్రించగల భావనా ప్రతిభ కరుణతో సుప్రభాత కాంతిని విరజిమ్మిననాడే, యీ ప్రపంచపు దుర్నీతి, దుస్థితి నిరామయము కాగలదు. యీనాటి పోకిరితనం, హతమార గలదు. ధరిత్రిలో ఐక్యత ఆనాడే సమకూర గలదు. విశాలమైన ప్రజాబాహుళ్యంలో అనివార్యమైన నా రచనాశక్తి సృష్టి ప్రేమానుబంధాన్ని సమకూర్చి విశ్వశాంతిని రూపొందించగలదని ఆత్మశుద్ధిగా పరవశ మౌతున్నాను.

రచయిత,

# ఇదే ప్రపంచం

## మొదటి అంకము



[భూస్వామి వెంకట్రామిరెడ్డి మేడలో ఒక గది. టేబిలుమీద తెల్లటిగుడ్డ పరచి పుష్పాలు, సిగరేటు టిన్ను అలంకరించబడి ఉంటాయి. ఒక సోఫా, కుర్చి, గోడకు గాంధి, నెహ్రూ ఫోటోలు సొంపుగా అమర్చబడి ఉంటాయి. పాట మొదలుపెట్టిన కొన్ని క్షణాలకు తెర లేస్తుంది. గోచికట్టు పంచితో, ఎఱ్ఱటి తుండుగుడ్డ తలకు గట్టుకొని నారయ్య పాత గుడ్డతో ఫర్నీచర్ ను తుడుస్తుంటాడు.]

యిదే, యిదే ప్రపంచం!
యీ మానవ ప్రశాంతం.
ధనవంతుల బాధలకు
నిరుపేదల మారణం.

ఆకటితో, ఆశలతో!
అసువు లరుగు యాతనతో.
మృత్యుపథం జేరుచేనా?
నిరుపేదల నుదుటి సుఖం.

యీ మానవ సిరి సంప[illegible],
యీ లోకపు కాంతి శో[illegible]
శ్రమజీవుల హృదయా[illegible];
శాంతి గూర్చబోదా [illegible]?

నరరాక్షస భోగంలో,
నిండుకొన్న స్వార్థత్వం!
నిర్భాగ్యుల జీవితాన్ని.
నరకబాధ జేయుచేనా?

యీ హంతక పాలనలో!
నీ చాకిరి ఫలితానికి!
మిగిలిందా నీ తనువు
శల్యమైన బరువు బ్రతుకు!

యిదే, యిదే ప్రపంచం!
యీ మానవ ప్రశాంతం
ధనవంతుల బాధలకు
నిరుపేదల మారణం!

[పాట పూర్తికాగానే, పంచికట్టుకొని, అరచొక్కా వేసుకొని, చత్వారపుటద్దాలు జారి ముక్కు కొసకొస్తుంటే సర్దుకొంటూ, చింపిరి తల్తో, చేతిలో ముక్కుపొడి డబ్బీ జోబులో కొన్ని కాగితాలు, కంటి అద్దం పెట్టెతో, యేమిటో గొణుక్కొంటూ గున్నయ్య ప్రవేశం]

గున్నయ్య: ఛీ....ఛీ...రాను - రాను లోకం పాడై పోతూ ఉంది!

నారయ్య: ఏంటయ్యో...గున్నయ్యో - లో-కా-న్నే—

గు: మనుష్యులన్నప్పుడు భయం, భక్తీ అక్కర్లే!

నా: (నవ్వుతూ) మల్లా...యెవురిమీాద నీ ద్వజం!

గు: (కుర్చీని లాగి కూర్చుని కళ్ళు మిటకరించి, కోపంగా ముక్కుపొడి పీలుస్తూ) అదేపనోయ్ మాట! ధ్వజ మట ధ్వజం!

నా: ఐతే....ఎందుకయ్యా అలా మసిలిపోతున్నావ్!

గు: (కోపంగా) నేను కాగేనీళ్ళనుగాదు లేవయ్యా. మసిలి పోనూ!

నా: కాగిపొయ్యావో ... మాడిపొయ్యావో నా కెందుకు? రెడ్డి నీ కోసమని పొద్దుట్నుండి మీ యింటికి మూడు మాట్లు కబురుపంపాడు తెలుసా?

గు: తెలుసు లేవోయ్! మహా ... నీ ఒళ్ళు దగ్గరబెట్టుకొని నాతో మాట్లాడాలని మొన్న జెప్పలే? సిగ్గులేకపోతే సరి!

[యింతలో...నారయ్యా - నారయ్యా అని లోపల శబ్దం]

నా: (పిలుపు నుద్దేశించి) అయ్యా!...అయ్యా! (లోపలి కెళుతూ, కోపంగా) ఈర్ష, మొసం, కుళ్ళు మాకెం తెలుసు. అవి తెలిసినోళ్ళే సమయానుకూలంగా ఒళ్ళు దగ్గర బెట్టుకోవాల్సింది!

గు: (తల వూపుతూ, ముక్కు-పొడి పీల్చి) పీడి కళ్లు నెత్తి కొచ్చాయ్.... వెధవ...ఛాకిరిముండాకొడుకు!

[కొన్ని క్షణాలకు బారీశరీరం, పెద్ద నుదురు, కోటేరేసిన ముక్కు, బొద్దు మీసాలు, ఖద్దరు పంచె, చొక్కా, పై కండువా అలంకరించుకొని వెంకట్రామిరెడ్డి ప్రవేశం]

గు: (కుర్చీలోనుండి లేచి నవ్వుముఖంతో రెండు చేతులెత్తి) నమస్కారమండీ!

వెం: కూర్చో...కూర్చో (సోఫాలో ఠీవిగాపండుకొని టేబిలు మీద సిగరేటుటిన్ను తీసి, పొగపీలుస్తూ) నీ కోరకు మూడుపర్యాయాలు కబురీవాళ!

గు: (కుర్చీలో కూర్చుని వినయంగా) యింట్లో లేనండీ .... మా అల్లుడింట్లో వురుడు భోజనానికి రమ్మని పట్టు పట్టడంతో వాడిమాట కాదని చెప్పలేకపోయా !

వెం: ఆఁ....పర్వాలేదులే, ఊళ్లో అల్లుడు.... అవసరంగూడా అంతలే. దేవాలయ కమీషనర్ ఒక వారంలో వస్తాడని తెలిసింది...అందుకని___

గు: (ఆశ్చర్యంగా) ఏనా పోదాముండాకొడుకు గోయింద రెడ్డి యంతపని జేశాడండీ .... కమీషనర్ వరకూ నడిపాడు కథ.

వెం: హుఁ.... (కోపంగా) నడపడూ మరి - యే బిగువు జూచుకొనో యీ మిడిసిపాటు.

గు: మన బిగువే !

వెం: అంటే ?

గు: మనబ్బాయిని తోడబలుక్కొన్నాడు ... ఊర్ని ఆటాడి పిస్తున్నాడు !

వెం: (ధీమాగా) ఊఁ...

గు: (ఉద్రేకంగా) రాను - రాను పరిస్థితులు విషమించి పోతు న్నాయండీ! ....ఊరిబైట రాత్రి,రహస్యంగా మీటింగు జరిపారట_దేవాలయ భూమివిషయమే ఐయుంటుంది ! కమీషనర్ రానున్నాడుగదా ?

వెం: (తాగుతున్న సిగరేటు కిందేసి కాలితోనలిపి మరొక సిగరేటు వెలిగించి పొగపీలుస్తూ) పక్కలిరగదన్ని .... తగినశాస్తి జేయిస్తే....వీడు, వీడి మీటింగులు, ఉప

న్యాయాలు ఇనుప సంకెళ్ళకు, జైలు కమ్ములకు జెప్పు కోవాలి!

గు: ఆ పని జేస్తేగాని బుద్ధి కుదరదు లెండి!

వెం: నిప్పు గాలిని తోడు జేసుకొన్నట్లుగా మనవాడికీ పూర్తి విషం నాదిపోశాడన్నమాట—

గు: అసలు...విషయం మీకు తెలిసినట్టులేదే! మనబ్బాయికి చెల్లెల్నిచ్చి పెళ్లి జేయాలని యత్నిస్తున్నాడట, మా అల్లుడన్నాడు!

వెం: (కళ్లెఱ్ఱజేసుకొని గంభీరంగా) వాణ్ణి వాడి వంశాన్ని నాశనం జేయిస్తా పరలోకంలో జేయిస్తాడు పెళ్లి.

గు: (కుట్రగా) మరోకసంగతి.... మొన్న నే మీ చెవినేద్దామని - యెందుకులే అనుకొన్నా. నావిటిదగ్గర మొన్న సాయంకాలం గోయిందరెడ్డి ... అబ్బ, సుబ్బారెడ్డి నోటికొచ్చినట్లు జనాన్ని పోగుజేసి పేలుతున్నాడు. నన్నుజూచి మరింతా జాస్తయింది నోరు. మీరేమొ గ్రామంలో అక్రమంగా పెత్తనం చలాయిస్తున్నారట, నేనేమో మీకు తాళా లేస్తున్నానట. దౌర్జన్యంగా దేవుడిభూమి యాభై యకరాలు సొంత భూమిలో కలుపుకొని దేవుడికే ద్రోహంజేసి అనుభవిస్తున్నారట, దొంగలెక్కలు వ్రాసి, వడ్డీకి వడ్డీలు పెంచి పేదలప్రాణాలు తీస్తున్నారట. (రెండుచేతుల్తో చెవులు మూసుకొని) ఓ యబ్బా ఇంకెన్నో లెండి... మన నారయ్యకూడా మీటింగుకు హాజరైయున్నాడు,

[మాసికలేసిన చొక్కా, పాత పైజామా వేసుకొని, బాకీలపుస్తకం పట్టుకొని, ఆకలితో బాధపడుతూ గుమాస్తా కోటయ్య ప్రవేశం]

కోటయ్య: (వెంకట్రామిరెడ్డి నుద్దేశించి) అందరూ నెలా, రెణ్ణెల్లూ వాయిదా వేస్తున్నారండీ!

వెం: (కోపంగా) గనక్నమెంటు శిస్తులుగూడను జెప్పలేక పోయ్యావా.... వాయిదాల ప్రకారం చెల్లించడానికి.

గు: (హేళనగా) మనం మెత్తగా పోతుంటే మెడలు తవ్వడే రకం, తెలుస్తూనే ఉందిగా!

వెం: వారంరోజుల్లో పద్దులన్నీ పూర్తిగా చెల్లించాలని గట్టిగా చెప్పలేదటయ్యా?

గు: (ముక్కుపొడి పీలుస్తూ) యీ మాసూలా, దాటిందంటే దమ్మిడీ వసూలుగాదు....ఆఁ....

వెం: ఖండితంగా చెల్లిస్తారా, చెల్లించరో కనుక్కోక నీళ్లు నమిలితే యేం లాభం?

గు: (కళ్లు మిటకరించి) దావాలు దగభగాలు జేసి, జప్తీలు జరిగేటంతవరకూ యింతే లెండీ!

వెం: ఆహ్హా....అంత రాద్ధాంతం చేస్తేగాని, గుణంకుదిరేట్టులే!

కో: (దీనంగా) కుప్ప లిప్పుడిప్పుడేకదండీ నూరవడం?

వెం: ఆవు....నూరిపి యింట్లో బోసుకొన్నంతమాత్రాన మన బాకీ తీరినట్లేనటయ్యా!

గు: (మెత్తిపొడుపుగా) మన బాకీ తీరాలా....వాళ్ళ కడుపు నిండితే చాలదూ!

వెం: సుబ్బారెడ్డి వాయిదా యెన్నాళ్ళో?

కో: కుప్ప నురిసి, తక్షణం చెల్లిస్తానన్నాడండీ!

వెం: రెండు సంవత్సరాలనుండీ యివ్వాల్సిన మొత్తంలో చిల్లిగవ్వ జమలేదు.... ఆ గోసిపాతంత చేలోవచ్చిన వడ్లతో బాకీ తీరస్తాడట్నా.... ఉపన్యాసాలు మాత్రం నోటికడ్డూ ఆపు లే—

గు: పెద్దలుసామెత ఊరకపోతుందా ? మింగను మెతుకు లేకపొయ్యినా, మూతికి సంపెంగవాసనని.

వెం: (వికటంగా) హ్హాఁ.... హ్హాఁ.... హ్హాఁ.... హ్హాఁ—అచ్చెన్న ఉంది యిదోరణి.

గు: (చేతులు తిరగేసి) కుప్ప నురిస్తే కనబడుతుందిగా ఆ తెంపూ యెంతవరకో?

కో: అందులో, తెంపేఉంది? యివ్వాల్సిన బాకీ యివ్వకపోతే దండించి వసూలు జేసుకోవచ్చుగా?

వెం: (కోపంగా) ఆయనతాత సంపాదించిన ఘుంటుంటేగా దండించి తీసుకోవడానికి?

గు: (గుడ్లు మిటకరించుకొని) యిందులో నీకు రోసం వచ్చిందంటోయ్?

కో: నిజంచెబితే రోసం—

వెం: యేంమిట్రో పెద్దోళ్ళతో వాదాలో (కోపంగాచూస్తూ)

గు: (విషపు నవ్వుతో) యీ మధ్య మనవాడు సంఘపు ధోరణి నేర్చుకొన్నాడులెండి.

కో: (కోపంగా) యీ మధ్య నీవూ నేర్చుకొన్నావుగా చీమ [illegible] చికాకులుబెట్టడం!

వెం: (బెంచిగుద్ది) చాలించు .... వెధవ – నీ మాటలూ, నువ్వూను వెళ్ళిడ్డించి – వారంరోజుల్లో సుబ్బారెడ్డి బాకీ వసూలు చేసుకురావాలి అప్పటిదాకా నీముఖం నాకు చూపించకు—

[కోటయ్య నోట మాటరాక, దిగులుగా రంగం వీడి పోతాడు]

గు: చూడండీ....చూడండీ. వీడు మెల్లగా యంతమాటనే శాడో!

వెం: ఒక్కొక్కడికి....వళ్లు కొవ్వెక్కింది, రౌడీగాడిదలు.

గు: దేవాలయ భూమి విషయంలో గోవిందరెడ్డి వగైరా, సంఘం పోదాలు కమిషనర్‌కు పంపిన పిటిషన్లో వీడి చేవ్రాలు చేశాడని....మా అల్లుడే అన్నాడు—

వెం: వీడు అంతవరకు వచ్చాడన్నమాట—

గు: రాకేం! తిన్నయిల్లు గుద్దలించే రకం!

వెం: యేదో, పేదవాడని కనికరించి పని స్తే...వీడూ ఆ సంఘంవాళ్ళతో కలిసి, నామీద కత్తెత్తాడా .... (ధీమాగా) కాని వీళ్లునన్నేంజేస్తారో చూద్దాం?

(నారయ్య రెండు కాఫీ లెత్తుకొని ప్రవేశమై టేబిలుమీద ఉంచుతాడు)

వెం: (కాఫీ తీసుకొని తాగుతూ గున్నయ్య నుద్దేశించి) తీసుకోండి కాఫీ.

గు: పర్వాలేదు లెండి (కాఫీ తీసుకొని తాగుతుంటాడు)

వెం: (పరధ్యానంగా) యేంరా నారయ్యా....సుబ్బారెడ్డి నా విషయం, ఊళ్ళో నాటేస్తున్నాడటగా? యేమిటి విషయాలు?

నా: యేటో అయ్యగోరూ? (చేతులు గట్టుకొని) ఆ గొడవ నాకు పట్టిందిగాదు.

గు: (పరుషంగా) మొన్న సాయింకాలం సావిటిదగ్గర లేవూ?

నా: .... .... .... ...... .. .... ....

వెం: యేరా పలకవ్?...అజంతా శిల్పంలా నిలబడ్డావ్?

గు: సంఘం నాయికుడు సుబ్బారెడ్డికొడుకు, తండ్రివిషయం యెక్కడన్నా నోరు కదిపితే సంఘంలోనుండి తీసెయ్యడూ!

నా: (గున్నయ్యనుద్దేశించి, కటువుగా) సంఘం మాకు ఒక ముద్ద పెట్టిపోషిస్తుందటయ్యా సంగంలోనుంచి తీసేస్తే బయపడ్ను. మా రెక్కలాడాలి, డొక్క నిండాలిగాని!

వెం: (కోపంగా) పన్లకు రానివ్వకుండా, సమ్మెలు జేయించి, హక్కులు సంపాదించి పేదలకు మేడలుకట్టిపెట్టాలని నోటికొచ్చినట్లు లెక్చర్లిస్తూ ముద్దరేసుకోనున్నారుగా అబ్బా, కొడుకు. వాళ్ళ పాదసేవ జేశావంటే, రెక్కలాడాల్సిన పనేంలేదురా! డొక్కలే నింపుతారు—

గు: (కాఫీ ఒక్కగుక్కలో తాగి టేబిలుమీదవుంచి) ఆట్టే... చూస్తే మార్క్సిజం వంటబట్టేపోయింది!

నా: (జాలిగా) యెందుకయ్యా గున్నయ్యా! లేనిపోనివి జెప్పి కడుపుకూడు తీస్తావ్!

వెం: (బెంచిగుద్ది) అంత భయంగల్లావాడివి, మా కూడు తింటూ మా గుడ్డ కడుతూ...ఆ సంఘంలోజేరి యేం జెయ్యాలనుకున్నావ్ రా? దుర్మార్గుడా!

నా: (వణికిపోతూ) నిన్న పొద్దున చిన్నరెడ్డి, కూలీసంఘం ఆఫీసులోకి, సుబ్బారెడ్డిని తోడుకొని రమ్మన్నాడు. నేను వాళ్ళింటికి వెళుతూఉంటే సావిటిదగ్గరే కనిపించాడు. అంతకన్నా నాకేం తెలీదండీ; నేను వాళ్ళల్లో కలవ లేదండీ, నా బిడ్డలతోడు.... నాకేం తెలీదండీ!

వెం: (పరధ్యాన్నంగా కాఫీగ్లాసు టేబిలుమీద ఉంచి సిగరేటు తీసి పొగ పీలుస్తూ) సంఘం, నెరవేరడానికి సగం ఆయువుపట్టు మన రెడ్డిగారే నన్నమాట (నారయ్యతో కోపంగా) నాయింట్లో నామాట తప్పక యింకెవ్వరిమాటా వినిపించుకోగూడదు తెలుసా!... పో—పని జూచుకో యికమీదట యిట్లాంటి విషయం చెవినబడ్డదా....తగిన శాస్తి జరుగుతుంది!

నా: (టేబిలుమీద గ్లాసులు తీసుకొని నిష్క్రమిస్తూ) చిత్తం ....చిత్తం!

వెం: (బెంచి గుద్ది) యీసం–ఘా–న్ని–మాపుమాపే టంత వరకూ—

గు: ఆ... (చిరునవ్వుతో) మీ దృష్టిపడ్డదంటే అదొక పెద్దపనా?

వెం: ఐనా! సుబ్బారెడ్డి రోజురోజుకు విపరీతమైపోతుంటే!

గు: మొత్తానికి—కొడుకునుగన్నా అబ్బురిపిస్తున్నాడు. వాడి కొడుకే మిడిమాళం వాడికన్నా వీడు....ఐనా వాళ్ల ముఖం....వాళ్ళకంత ధీమా యక్కడిదండీ—మన బ్బాయి బిగువదంత్తా.

వెం: మావాడికి మాత్రం బుద్ధిలేకపోతే సరా? (పళ్లు గట్టిగా కొరుకుతాడు)

గు: (జాలిగా) యేదో ఉడుకురక్తం; మూడుముళ్లు కట్టిపడేస్తే విషయాలు తెలుసుకొంటాడు.... లేకపోతే ఆ సుబ్బారెడ్డి యేం ముప్పు తెస్తాడో?

వెం: (బెంచి గుద్ది) నా కంఠంలో ప్రాణం ఉండగా వాడి కూతుర్తో సంబంధమా?

గు: (వినయంగా) అందుకుగాదండీ.... వాడి చర్యలు చూస్తూనే ఉన్నాంగా: వాడు, అంతటి సమర్థుడే... యేఁవంటారు?

వెం: (ధీమాగా) చిన్నా చితకా?—బి. ఏ. చదువుకొన్నాడే ....దున్నపోతులా ప్రవర్తించడం గొప్పనుకొన్నాడు—వెధవ!

గు: చేతినిండా ఆస్తి....ఒక్కడు, బాగా చదువుకొన్నవాడు యింకేం, అల్లుణ్ణి జేసుకొని పెత్తనం చలాయించాలని, సుబ్బారెడ్డి, స్వర్గానికి నిచ్చెన్లేస్తున్నాడు...పాపం!

వెం: సిగ్గులేకుండా, యెత్తులేస్తేసరా?

గు: (కుట్రగా)ఐనా...యేవేవో, ఉపన్యాసాలిచ్చి గ్రామంలో యువకుల మనస్సు చెడుస్తున్నాడండీ!

వెం: దేశనాయకుడు కావాలని (శీవిగా) ఉబలాట పడుతున్నాడన్నమాట!

గు: (విషపునవ్వుతో) అఁ...ఆ—హుఁ...సందేహంలే!

వెం: యువకుల మనస్సేం మారుస్తాడు...వీడుమాడే కాలం దాపురించింది!

గు: ఐనా...చిన్నా, పెద్దా, లక్షణమే పోతూఉందండీ వూళ్లో ....నాయినగా రంటేంగా యెంత భయపడేవాళ్లు!.... యెంత భక్తి జూపేవాళ్లు!—

వెం: ఔను...(బెంచిగుద్ది) యిదంతా నా పొరపాటే— యీ సంఘాన్ని ప్రథమంలోనే హతమార్చి ఉంటే యింతదూరం—ఆలోచించాల్సిన పనుండేదేగాదు!

గు: యిప్పటికి మాత్రం మనకు మించిపోయిందేమీ లేదులెండీ! ఆ—సుబ్బారెడ్డిగాణ్ని అడ్డుతొలగించుకొన్నామంటే చాలు...(ఫటికేసి) వాడికొడుకు మన కాళ్ళ దగ్గరికే వస్తాడు....అప్పుడు,సంఘాలు ...రాద్ధాంతాలు లేకుండా అన్నీ పరిస్థితులు చక్కబడతాయి!

వెం: (ఆదుర్దాగా సున్నయ్యదగ్గరగా చేరేలాగి రహస్యంగా) యీ విషయంలో బహు రహస్యంగా మెలగాలి లేకుంటే—

గు: (ఉత్సాహంగా) అమ్మో...నాకుమాత్రం తెలీదూ? అంతమాత్రం!

వెం: వీలైనంత జాగ్రత్తకూడా అవసరం....యేలాంటి సందర్భంలోనైనా విషయాలు బైటికి పొక్కాయంటే ప్రాణాలకే అపాయం.

గు: (సమర్థనీయంగా) అప్పుడుగదు, మరి.... సామాన్యమైన విషయమై తేగా!

వెం: (తటాలున గున్నయ్య చెయ్యిపట్టుకొని వదలి) యీ కార్యానికి తగిన సహాయం...నీవూ చేయాలి!

గు: (సంతోషంతో ఉబికిపోతూ) యేటండీ...అలాఅంటారు మీమాట యెప్పుడు ధిక్కరించాను? మీ బాగే— నా బాగు, మీ గౌరవమే— నా ప్రాణం.... అసలు మీ సహాయం లేకుంటే యీవరకు యే పరిస్థితిలో ఉండే వాణ్ణో—

వెం: (నీరసంగా) ఔను....నాపట్ల అభిమానంగా మెలిగేది ఇప్పటివరకూ నీ వొక్కడవే!

గు: దాందేందిలేండి....విశ్వాసం కావాలిగాని!

వెం: యీ విషయంలో నెగ్గామంటే....గ్రామంలో పీడ విరగడైనట్లే!

గు: (ఆలోచనగా) అసలు యీ సంగంలో మన జోక్యం లేనట్లుగానే నడపొచ్చు కథను— ఆఁ....(కుర్చీలో నుండి చివాలున లేచి, వంగి వెంకట్రామిరెడ్డి చెవులో కొన్ని క్షణాలు రహస్యం చెప్పి మళ్ళీ కుర్చీలో కూర్చుంటాడు)

వెం: (ఉత్సాహంగా) భలే....భలే...సమర్థనీయంగా ఆలోచన జేశావ్ పద్ధతిని!

గు: (నవ్వుతూ) మరేం అనుకొన్నారండీ!

వెం: (అనుమానంగా) ఆపని జేసేటందుకు మంచి గుండెబలం, మనవాడికే ఉందంటారా?

గు: గుండెబలం...కలిగేటట్లు జేస్తే సరిగా—చూస్తారుగా గున్నయ్య తడాకా?

వెం: (గర్వంగా) సమ్మెల్లో వాళ్లోనే లబ్ధి కొడుకులంతా నాయకుణ్ని యట్లారక్షించుకొంటారో చూదాం?

గు: (సమర్థనీయంగా) రక్షించుకోవాల్సిందే పరలోకానికి పోయిన తర్వాత!

వెం: (నిరుత్సాహంగా) ఐనా ....యీలాంటి పన్లు మొగిసి, పరిస్థితులు కుదటపడేటంతవరకూ .... మనం ముందుగా తలదాసుకోవడం—

గుం: (చిటికేసి, కుర్చీలోనుండి లేచి) ఆ అనుమానం మీ కెందుకు కలిగింది (ఉద్రేకంగా) యిదిగో—యిప్పుడే విషయం తేల్చుకొస్తా—

వెం: (చేర్లోనుండి లేచి జేబులో చెయ్యివేసి) ప్రస్తుతానికి డబ్బవసరం గదూ?

గు: (మౌనంగా చేతులు నలుపుకొంటు) అఁ...యెందుకు లేండి!

వెం: (జేబులోనుండి డబ్బుతీసి) ప్రస్తుతానికి యీ నాలుగొందలు సర్దు, పనయ్యాక, కనిపెట్టి తగినట్టు యిస్తాం గాని—

గు: (ఆదుర్దాగా, డబ్బుతీసుకొని పంచె కొంగున కట్టుకొని) డబ్బు ఎక్కడికి పోతుందండీ.... పాపి డబ్బు—అను కొన్నాపని కావాలిగాని!

వెం: (ముక్కుమీద చేయివేసుకొని) యీ విషయంలో, నా పేరు బైటికి రానివ్వకుండా, అంతా నువ్వే సర్దె య్యాలి—ఆఁ—

గు: బస్...అంతేగా, యే ఆటంకం లేకుండా పని జరిగేదేగా మీా కావాల్సింది, చూస్తారుగా?

వెం: (కుట్రగా) అంతపెద్దగా నాకు ముప్పొస్తుందనిగాదు... అశ్రద్ధగా ఉన్నామంటే - నీకూ యిబ్బంది రావచ్చు!

గు: (ధీమాగా) మీారు నాకు అండగా ఉన్నంతకాలం.... యేం ఫర్వా లేదులెండీ....కొండల్ని కొట్టి పిండిజేయనూ.

వెం: (హుషారుగా) యీలాంటి విషయాల్లో తాచారం పనికిరాదు.... కార్యం యెంతత్వరగా ముగిస్తే అంత మంచిది... తెలుసా?

గు: (ఆదుర్దాగా) అంతేగనూ మరి...యిక నేను పోయిరానా?

వెం: (ఆలోచనగా) ఆఁ....మరి చూ, తటీమూ పైకం, తర్వా తనే (ముక్కుమీాద వేలుయేసుకొని కుట్రగా) నాపేరు వాళ్ళతో జెప్పకుండా యెంత గూఢంగా-ఉంటే.... అంత మంచిది!

గు: ఆఁ - రహస్యానంతా నేను సర్దుకొంటానుగా (చిరు నవ్వుతో) నమస్కారం యిక నేను సెలవుతీసుకోనా?..

వెం: (చిరునవ్వుతో) ఆఁ...మంచిది!

గు: (ముక్కు పొడి పీలుస్తూ తెరవిడిచిపోతూ) దైవం మన పక్షం ఉన్నాడులెండి.... యేం పర్వాలేదు కార్యం, అదే నిగ్గిపోతుంది.

వెం: (నిరుత్సాహంగా తలమీద చేతులుంచుకొని సోఫాలో పడుకొని) 'పుణ్యంకొద్దీ పురుషులు, దానం కొద్దీ బిడ్డలు'ని పెద్దలుజెప్పిన సామెత, అనుభవం కొద్దీ చెప్పిందే! నా కర్మ...(తలకొట్టుకొని) బిడ్డగా పోగయ్యాడు.

[కొన్ని క్షణాలకు చేతులువరకు ఫుల్‌షర్టు, పంచె, మొఖాన నామం, చేతిలో వంకీకఱ్ఱ పెళ్ళిపెద్దలాగ శాంతయ్య దగ్గుతూ ప్రవేశం]

వెం: (ఠీవిగా సోఫాలో ఆలోచనగా కాలుమీద కాలేసి పడుకొని సిగరెట్టుపొగ పీలుస్తూ) రా...శాంతయ్య కూర్చో (కుర్చీ జూపుతాడు)

శాం: (చిరునవ్వు నవ్వుతూ) రోజూ ప్రయాణం, సద్దికూడు పని చెర్వని.... పెద్దలు జెప్పిన ప్రయాణం ఐపోయింది ...నా రాక (కుర్చీలో కూర్చుంటాడు)

వెం: ఐతే....యీసారి పరిష్కారం చేసుకొచ్చావన్నమాట_

శాం: డబ్బుతో గూడిన విషయాలు గదండీ....అంత సులువుగా పరిష్కారం కావడమేనా?

వెం: (ముఖం చిట్లించుకొని) నాలుగునెల్లనుండీ వ్యవహారం పేచీలుగానే నడుస్తూఉంది .... కాని ఒకదారికొచ్చే దెప్పుడో?

శాం: (నోరంతా తెరచి గబగబా) అట్లా అంటారేమండీ.... వచ్చే మాఘమాసం ముహూర్తాలకే వివాహం నెరవేరి పోవాలని-మాట్లాడుకు రమ్మంటే!

వెం: ఓ యబ్బా ... యిప్పటికెన్ని పర్యాయాలో? కడసారి మాట్లాడుకరమ్మన్నారనే మాటల్లు.

శాం: ఒకనాటితో పోయే మాటలటండీ .... పదికాలాలపాటు నిల్చిపోయే అనుబంధం -

వెం: (తీవిగా) అందుకు మేము కాదన్నావా?

శాం: (వినయంగా) మన్నో మాట....అందరికీ ఉండేదే లెండీ... ఆడపిల్లను గన్నవాళ్ళు....అందువలన పరిస్థితులు అనుకూలపడేటంతవరకూ మనస్సు స్థిమితపడదుగా?

వెం: అందుకు నేను ముందుగానే జెప్పానుగా (దయగా) కట్నం విషయం...అనుకొన్న మొత్తాన్ని వివాహం నాటికే చెల్లించలేకపోయినా..సగం చెల్లించి, తర్వాత రెండు మూడు నెలల్లో తక్కిన మొత్తం, యిచ్చుకో వచ్చునని...

శాం: డబ్బుకేం యిబ్బంది లేదండీ (సునాయాసంగా) అనుకొన్న మొత్తాన్ని ముహూర్తంనాటికే చెల్లించేస్తారు.

వెం: ఐతే వివాహ విషయంలో....నా జాగేంలేదుగా?

శాం: వివాహ విషయంలో యువతిజాగూ లేదండీ...మాట్లాడుకొనేవి యేవో—ఈరోజే ఖచ్చితంగా ఒక మాట మీాది కొచ్చారంటే పేచీ వగదెగిపోతుంది!

వెం: అంటే?

శాం: కట్నం విషయమేగా!

వెం: (నడివడిగా ముఖం చిట్లించుకొని) యిదిగో.. శాంతయ్యా ఆ మడతపేచీలు మనదగ్గర చెల్లవు తెలుసా? యాభై వేలకు దమ్మిడీ తగ్గినా ఉపయోగంలే - ఆఁ.... అంతే-

శాం: అట్లా మీరు గట్టిగా పట్టుబడితే యేలాగండీ తెగిందాకా లాగగూడదుగా?

వెం: తెగిందాకా లాగేదేమిటయ్యా ... మొన్న మొన్న యాభై ఐదువేలు యిస్తామని కాళ్ళా యేళ్ళా పడి తిరిగిన సంబంధం,—నీకు తెలియకపోయిం దేఁముంది?-

శాం: దాం దేంది లేండి....యంతో మఁది వచ్చిపోతుంటారు కార్యంలోకి దిగితేగా లోతు కనిపించేది—

వెం: నీ ఉద్దేశం...యీ సంబంధం తప్పితే, పెద్ద కట్నం యవ్వరూ యిచ్చుకోలేరనా?

శాం: (వినయంగా) ఆలాగంటే, యట్లాండీ --వేరయ్యగారి కుటుంబ సమాచారం...యంత ఒకాళ ప్రక్క గ్రామం ఐతేమాత్రం, మీకు తెలియందిగాదు, ప్రస్తుతానికి... కొంచం....ఆ స్తిపాస్తుల్లో దెబ్బతిన్నదిగాని..నాయనుండంగా, యంతాటోపంగా బ్రతికేవాళ్లు యిం తెందుకు? ....యీ చుట్టుప్రక్కల మనిళ్లు తర్వాత, రెండో యిల్లు వాళ్ళదేగదంటుండీ!

వెం: అందుకనే గదంటయ్యా యీ కాలయాపన—

శాం: నాకు తెలుసు (సంతోషంగా) మీ మనస్సు నాయనగారి లాగునే ధారాళమైందని.

వెం: (గర్వంగా) ఆఁ...దాందేందిలే....

శాం: (మురిసిపోతూ) వీరారెడ్డిగారి కుమార్తె....అందచందాలలో యేమీ ఆక్షేపణలేని అమ్మాయి....మనబ్బాయికి యెలిగారం అతికినట్లుగా, దాంపత్యం, సరిపోతుంది....(గొప్పగా) యఫ్. ఏ. వరకు చదువుకొన్నదని...మీాకూ తెలిసిన విషయమేగా?

వెం: మావాడు మాత్రం...డబ్బంతా తగలేసి, బి. ఏ. చదివాడుగా?

శాం: అందులో డబ్బు తగలేశేదేముందండీ....డబ్బు సెలవుగాకుంటే, బి. ఏ. విద్య సామాన్యంగా వస్తుందా?

వెం: (వెగటుగా) యేడిశా! బి. ఏ. లు యం. ఎ. లు చదివి ఉద్యోగాలు జేసి ఒరగబెట్టేదంతా బోతుందా, ఏమిటి?

శాం: యేఁటండీ....చదువుకొనేది ఉద్యోగాలు జేయడానికా, కాస్తా, జ్ఞానం సంపాదించుకొనడానికేగా, మీబోటివాళ్ళకంతా—కాకుంటే మాలాంటివారికి నవకర్లు చేయకపోతే జరగదుగాని—

వెం: (హేళనగా) యింగ్లీషు చదువుల్లో జ్ఞానానికన్నా, అజ్ఞానం యెక్కువ -

శాం: యింగ్లీషు సాహిత్యం....చాలా గొప్పదని మావాడు అనేక పర్యాయాలు నాతో జెప్పాడుగదండీ.

వెం: అంతమంచి సాహిత్యం, గనుకనే (హేళనగా) మన యిండియాలో అక్షరంముక్క లేకుండా, తుడిచిపెట్ట బోతున్నారు -

శాం: మీరు జెప్పేది, నిజమేనండో... యెప్పుడో ఆంధ్ర ప్రభలో ఇంగ్లీషును పూర్తిగా తీసివేసే సూచనలు అంటూ.... ఇంగ్లీషునుగూర్చి యెవరో వ్రాసినట్లుగా యిప్పుడు జ్ఞాపకానికొస్తూవుంది-నిజమే, నిజమే!

వెం: (ఉద్రేకంగా) వందల సంవత్సరాలనుండి భారతదేశాన్ని పీల్చి పిప్పిజేసిన భాష వెధవల వెంగిటి కూతలు- అదొక భాషా!

శాం: ఐనా యీ దినాల్లో ఇంగ్లీషు చదువుకొన్నా వాళ్ళకే, అన్ని రంగాలలో గౌరవం, ఆర్జ లభ్యమౌతున్నాయి గాని తతమ్మావాళ్లు యేమూలో పొగనూసుకపోవడం జరుగుతుందండి. ఆదేం కర్మమోగాని, డిగ్రీలులేని వాళ్ళని లెక్కేపెట్టరు!

వెం: వేలకువేలు తగలేసి, దేశాభిమానం చంపుకొని, పిల్ల లకు ఇంగ్లీషు చదువులు చెప్పించడం, నాకు నచ్చదు. కాకుంటే మావాడేదో చదివేశాడుగాని, నాకా పట్టింపులేదు!

శాం: నాకు తెలిసిన అనుభవంలో తెలుగు చదవను రాయను వచ్చుంటే - యెంతో గొప్ప, కానీ యీ దినాల్లో ఆలాంటి చదువు లెక్కేలేదు. - ఐనా, యీనాడులు,

మాలలు, మాదిగలు, అందరికీ చదువులే, అదేం విచిత్రమో గాని!

వెం: కాబట్టి గదంటయ్యా (అసూయగా) కాలం, యీలా కాలిపోవడం. యవడికీబట్టినా. దేశదేశాల సిద్ధాంతాలు_రాద్ధాంతాలు!

శాం: సిద్ధాంతాల కేంలేండి! మా గ్రామంలో గూడా, రైతు సంఘాలని కూలి సంఘాలని కుఱ్ఱకుంకలంతా లేవదీసి బోలెడు నినాదాలు (తలపట్టుకొని) తల్లో వెంట్రుక లన్ని చట్టాలు వర్ణిస్తుంటారు, తెగేనా తెల్లారేనా!

వెం: (వెగటుగా నవ్వి) సంగాల తెగులు మీ గ్రామంలో గూడా ఉన్నాయన్నమాట!

శాం: మా గ్రామమే, యేంటండీ! దేశమంతాను!

వెం: (కోపంగా) పనిబాటాలేని సోమరిపోతులంతా జేరి దేశాన్ని చెడుస్తున్నారు. అంతకన్నా మరేం కనబడదు!

శాం: ఐనా_వీళ్ళ పిచ్చిగాకపోతే లేనిపోని సంఘాలతో ఊరేగుతూ గొంతులు చించుకొని ప్రాణం పోయేటట్లు మొరపెట్టుకొన్నంతమాత్రాన వీళ్ళు సాధించే దేముందని (నవ్వుతూ) గాలిమేడలు; స్వర్గానికి బొయ్యి అమృతం తెచ్చినట్లుగా!

వెం: సాధించాల్సిందే, వీళ్ళ మొఖం సూస్తాంగా అదిన్నీ-

శాం: ఆఁ...ఆ గొడవల్తో పనేంలేండి! కుక్క-గొడుగులు లేసి అణిగిపోతుంటాయి.

వెం: అంతేగా మరి!

శాం: సరేఁ! నే నెళ్ళొస్తా-ఆ విషయం -

వెం: (అ᳚ వినయంగా) చూడు-శాంతయ్యా! నువ్వేదో ఒక్క-పట్టున చెబుతున్నావు కాబట్టి నలభై ఐదు వేలకు పేచీ వగదెంచేశెయ్!

శాం: లేదులెండి! మరేం అనుకోకండి-ఆ, ఐదువేలు లేకుండా నలభై వేలకు -

వెం: (తీవిగా నవ్వుతూ) రానురాను వంకాయల బేరం ఐపో యిందే?

శాం: ఆఁ-ఆ మూడుముళ్ళు పడేదాకనేగా - యంత గోజా రినా ఆ తర్వాత మీారు మీారు ఒకటేగా!

వెం: ఆఁ.... పేరారెడ్డి మాత్రం తెలీకపొయ్యాడా మా పెద్ద లంతా స్నేహితులేగా, కాకుంటే యిప్పుడు ముఖపరి చయం తప్ప, అంతగా లావాదేవి లేదుగాని-

శాం: (వికటంగా నవ్వి) ముఖపరిచయా లేమిటండో! మీారు మీారు బంధువులు కాబోతుంటేనో?

వెం: (పెద్దమనిషి రీత్యా) సరే శాంతయ్యా! యేదో పెద్దవా డవు నీమాట కాదనలేను. పేరారెడ్డితో బంధుత్వం మానుకోలేను-కాబట్టి, నీ యిష్టప్రకారమే పోతున్నా. యింకొక విషయం, వివాహంనాటికే పైకం అంతా ముట్టిపోవాలి!

శాం: (ఉత్సాహంగా) ఓ-దానికేం లోటు లేదు లెండి; నలభై వేలు అణాపైసల్తో సహా వివాహంనాటికే ముట్టజెప్పే స్తానని ముందుగానే జెప్పానుగదండి!

వెం: ఆఁ...మరేంలే! డబ్బు విషయంగనూ, యెవరైనా జాగ్రత్తగా ఉండడం మంచిదని!

శాం: అంతేగదంటండి! మరి లోకమే డబ్బు; డబ్బు లేకుంటే క్షణం గడవదు.

వెం: అదంతా పిచ్చి, డబ్బు మనుష్యులు సంపాదించాలి గాని, మనుషుల్ని డబ్బు సంపాదిస్తుందా? డబ్బును సంపాదించకుండా మనం క్షణం ఉండలేమని, గట్టిగా అనాలి! నువ్వు....

వెం }
శాం } : నవ్వు -

శాం: (వినయంగా) సరేనండి! యిక నేను సెలవు తీసుకోనా?

వెం: నువ్వెప్పుడూ నిలువుగాళ్ళమీద ప్రయాణం!

శాం }
వెం } : (చిరునవ్వు)

శాం: దాఁదేందిలేండి! యికనెప్పుడొచ్చి పోతూఉండేవాళ్ళ మేగా! అదీగాక రెడ్డిగారు పట్నంపోవాల్సిన ప్రయాణం ఆపుకొని కారిచ్చి, మీ దగ్గరకుపోయి విషయాన్ని తేల్చుకురమ్మన్నారు. లేకుంటే యిక్క డెన్నిరోజు లున్నా మర్యాద కేంలోటు?

వెం: పేరారెడ్డి మాట నేను తోసెయ్యగలనా? యీ చిన్న విషయానికి ప్రమాణాన్ని ఆపుకోవాల్సిన అవసర మెందుకు?

శాం: యీ కార్యం మాత్రం, బాధ్యతగల్లదే గదంటండి మరి!

వెం: సరే లోపలికెళ్ళి భోంచెయ్యి, వెళ్ళుదువుగాని!

శాం: భోంచేసే బయల్దేరాం, అప్పుడే భోజనాని కేంలెండి! (కుర్చీలోనుంచి లేచి పై ఉత్తరీయం సర్దుకొంటాడు)

వెం: ముహూర్తం పెట్టుకొనేముందు పేరారెడ్డిని, ఒక పర్యాయం వచ్చిపొమ్మని చెప్పు.

శాం: తప్పకుండా వస్తాను లేండి, అబ్బాయిని ఓసారి చూడాలని, అనుకొంటూనే ఉన్నాడు—మీరు మాత్రం నాతో రావచ్చుగా?

వెం: ఆఁ...ఎందుకు రాగూడదూ!

శాం: రెడ్డిగారు నాలుగురోజుల్లో వస్తాను తీరికుంటే మీరూ రాండి! చూచొద్దురుగాని!

వెం: పేరారెడ్డి కుటుంబవిషయాలు మాకు తెలిసి నేటియ్యేగా?

శాం: పొయ్యొస్తానండీ! (నమస్కారం)

వెం: (ఠీవిగా నమస్కారం) మంచిది. (శాంతయ్య నిష్క్రమించును)

(వెంకట్రామిరెడ్డి సిగరెటు పీలుస్తూ, అటుయిటు తిరుగుతూ గాఢమైన ఆలోచనగా ఉంటాడు. విశ్వనాధరెడ్డి ఒకచందాపట్టీ పట్టుకొని ప్రవేశం.)

విశ్వం: నాఁన్నా!

వెం: (పరధ్యాన్నంగా) ఆఁ....

విశ్వం: మన గ్రామంలో లైబ్రరీ స్థాపించడానికి మనం కొద్ది చందా తప్పక సహాయం చేయాలి!

వెం: (వినిపించుకోని రీతిగా) లైబ్రరీ స్థాపిస్తున్నారా?

విశ్వం: (ఆదుర్దాగా) అవును — గ్రామంలో పేదలంతా తమ తాహత్తుకు తగ్గట్టుగా యిచ్చుకొంటున్నారు. మనం ఒక ఐదొందలు....

వెం: (హేళనగా) ఐదొందలేనా?

విశ్వం: ఆమాత్రం మనం యిచ్చుకోకపోతే యెలాగు? గ్రామంలోకంతా కాస్తో - కూస్తో కలిగున్నవాళ్ళం మనమేగా!

వెం: (చేతు లెల్ల కేసి) ఆఁ....సరే!

విశ్వం: (సంతోషంగా చందా పట్టీని అందించబోతూ) మన మొత్తం యీ పట్టీలో వ్రాస్తే తెలిసినట్టుగా ఉంటుంది.

వెం: (కాగితాన్ని ముట్టుకోకుండా సోఫాలో కూర్చొని కుర్చీ చూపుతూ) అలా గేకాని—యిలా కూర్చో విశ్వం —

విశ్వం: (కుర్చీలో కూర్చుని) యిట్లాంటి కార్యాలు తొంభై పాళ్లు యెక్కువ సహాయం చెయ్యగల్గా వాళ్ళమీదనే ఆధారపడుంటాయి నాఁన్నా —

వెం: (విషపు నవ్వుతో) అట్లా అని — నీ నెత్తి నేనుకొని యీడాలనుకున్నావన్న మాట.

విశ్వం: యిందులో ఒకరు నెత్తినేసుకొనేదేం ఉంది నాన్నా - నలుగురి క్షేమం. గ్రామమంతాకలిసి నియమించుకొన్న కార్యక్రమమేగా.

వెం: ఆс...(హేళనగా) గ్రామంలో దండిన అణాపైసల్తో లైబ్రరీ బిల్డింగులు దానికితగ్గా ఆటోమాలొస్తాయా ?

విశ్వం: పంచాయతీబోర్డు డబ్బు ఐదువేలు ఉండనే ఉందిగా! లైబ్రరిగ్గా రెండువేలు ప్రత్యేకించొచ్చుగా?

వెం: (దీమాగా) ఊс...

విశ్వం: (అధికారంగా) లైబ్రరీకి మన సహాయం తప్పని సరి!

వెం: చూదాం!

విశ్వం: (చిరునవ్వుతో) మీారు, యిట్లాంటి విషయాల్లో చూదాం - చూదాం అంటూ తాచారం జేసి సమయానికి యేదో వరుకు బెట్టడం...

వెం: (కోపంగా) కార్యాహా పేకా సహాయంజేసి, గ్రామాన్ని సక్కదిద్దేవాడు యింకొక నాయకుడున్నాడుగా? ఏదో వరుకులుబెట్టడం నాదే పొరపాటన్న మాట?

విశ్వం: (నిరుత్సాహంగా) మీారావిధంగా, ఉద్రేకపడ్తారని తెలిస్తే....

వెం: నిజం చెప్పితే నీకు ఉద్రేకం కొవచ్చు (దీనంగా) చూడు విశ్వం చిన్నవుగాదు చితకవుగాదు బి ఏ. చదువుకొన్నావ్. గ్రామంలో నామీద కత్తిగట్టేవాళ్ళతో నా నీ స్నేహం....

విశ్వం: యేంటి నాఁన్నా - కూటికి అరచకాదుతూ! కష్టం జేసి న్నాడు, అర్ధకడుపుతో తృప్తిపడేవాళ్లు, మీా మీాదనా కత్తిగట్టేది? అంతా మీా భ్రమ!

వెం: (కుర్చీలోనుండి లేస్తాడు, వెంటనే విశ్వం) నీవు ఒక విషయంమాత్రం మరిచిపోకు. కూటికిలేక అర్చుకాడే వాళ్లు, కూటికున్నవాళ్ళను యేపనైనా జేయగలరని- ఆఖరుకు పీకనొక్కే-దానికైనా సరే!

విశ్వం: (ఆశ్చర్యంగా) మనమీాద అంత పగ సాధించేవాళ్ళు యీా గ్రామంలో....

వెం: హుఁ....నీకు తెలీదేం -

విశ్వం: ఏంటి నాఁన్నా - అపార్థం జేసుకొంటున్నారే?

వెం: ఔను - నా దృష్టిలో మెలుగుతున్న కార్యాలన్నీ వ్యర్థాలే- అర్థం యెందుకుండాలి?

విశ్వం: (దీనంగా) నన్నే మీారు అంతగా అనుమానిస్తే, యేం జేయడం?

వెం: (వినయంగా విశ్వంమీాద చెయ్యివేసి) చూడు విశ్వం! యింకా యెన్నాళ్లు యీా బ్రహ్మచారి తనం?

విశ్వం: యేంటి నాఁన్నా - మీాకా అనుమానం యెందు కొచ్చింది?

వెం: అనుమానం సమయమొచ్చినప్పుడు తీర్చుకోవాలిగా!

విశ్వం: నా పెళ్ళివిషయంలోనా?

వెం: కాకుంటే-యేఁటి మరి! యిప్పటికే పాతికేళ్లు దాటాయ్

కానీ యెన్ని సంబంధాలొచ్చినాససేంరా అని మొండి పట్టుపడితే ఎలాగు?

విశ్వం: పెళ్ళంటే మాటలా? జీవితాంతమువరకూ ప్రేమానుబంధంగా, మనస్సులు ఏకం జేసుకొని, కష్టాలను,సుఖాలను యీదడం. అట్లాంటి విషయంలో ఒకరి విషయంలో మరొకరు తలదూర్చి నచ్చజెప్పడం నా కిష్టం లేదు-సమయంవచ్చినప్పుడు దానంతటదే అవుతుంది.

వెం: (కోపంగా) నాకు నీమీద ఆమాత్రం అధికారం లేదన్న మాట?

విశ్వం: అధికారానికా? కానివ్వండి మీ యిష్టం, న్యాయసమ్మతంగా, యేపని చెయ్యమన్నా చేస్తా.

వెం: ఐతే - పెళ్ళిజేసుకొని ఒక యింటివాడవుకమ్మని జెప్పడం న్యాయసమ్మతం కాదన్నమాట. నేఁ జెప్పేది, నీ దృష్టిలో అన్యాయపు ఘోరమనేనా నీ ఉద్దేశం - ఆఁ, అంతేనా?

విశ్వం: హుఁ...మనం మహారాజులం. పిచ్చి సంఘం పెళ్లి రూపంలో కట్నంయిచ్చి యువకుణ్ణి కొని సత్కరిస్తుంది. అందువలన మీరు డబ్బుకొరకు నా జీవితాన్ని యింకొకరికి అమ్మేస్తారన్నమాట? యిదేనా తండ్రికీ బిడ్డకూ, ఉండే అనురాగ సంబంధం?

వెం: ఆలోచించు నిన్ను నీవు అర్థంజేసుకొనే మాట్లాడుతున్నావా?

విశ్వం: మనస్తత్వం తెలుసుకోకుండా నన్ను వ్యర్థంగా బాధించడం మీకు మంచిదంటారా?

వెం: (కోపంగా) అవును—నిన్ను నేను అర్థం జేసుకోకనే, చిన్ననాటినుండీ కంటికి రెప్పలా కాపాడి, యెంతో ఆప్యాయంగా నీకు కావాల్సిన సదుపాయాలకు కించిత్తు లోటులేకుండా, అడిగినప్పుడల్లా డబ్బందించి, నిన్ను బి. ఏ. దాకా చదివించి యిప్పటివరకూ నీ శ్రేయస్సునే కోరుతున్న నేను, నీ మనస్తత్వాన్ని యీ క్షణంలో అర్థంజేసుకోగలిగా తెలుసా?

విశ్వం: (ఆవేశంగా) మీ డబ్బంతా ఖర్చుజేసి బి. ఏ. చదివించారు—హుఁ—మీరు అమాయకులై నన్ను చదివించారా? నన్ను పశువునుజేసి నామీద ఒక విలువ గట్టి పెళ్ళిళ్ళ మార్కెట్టులో వేలంవేసి, లాభం గడిద్దామనుకొన్నారు.—అంతేనా? కన్నబిడ్డ జీవితసుఖంలో నిప్పులుబోసి అగ్నిజ్వాలల రేపి నాకై వినియోగించిన డబ్బు గడిద్దామని మీ స్వార్థం మీరు చూచుకొన్నారు, నా బ్రతుకును స్వేచ్ఛలేకుండా చీకటిజేద్దామనుకొన్నారు, తండ్రి, బిడ్డపైన చూపాల్సిన ఉదార ప్రేమ యిదేనా?

వెం: నోర్ మూయ్. (చంపమీద కొట్టేస్తాడు).

విశ్వం: అవును—నీవు కొట్టింది నన్నుగాదు, నాలో మదించి, జీర్ణించుకపోయున్న సుఖాన్ని. ఎంతమంది నిలువ నీడ లేక దారిపొడుగునా చెట్లనీడల్లో కాపురాలు జేసి

జీవిస్తున్నారో, ఆకటి అంధకారంలో, ఎంతమంది నిర్భాగ్యులు మృత్యువుకు బలైపోతున్నారో—కానీ కళ్ళకు పొరలుగమ్మిన సిరిసంపదల్తో అనుభవిస్తున్న నాకు విశాలహృదయంతో ప్రపంచాన్ని పారజూడమని పాఠం నేర్పారు!

వెం: (పశ్చాత్తాపంగా విశ్వం చేతులుపట్టుకొని) నాయనా విశ్వం! యీ ఆస్తంతా నేను నెత్తినేసుకొని పోవడానికా? యింత శ్రమపడి సంపాదించినా నీకేగా, నువ్వు నామాట కాదనవు, పేరారెడ్డి మల్లా కబురుపంపాడు. పెళ్లివిషయంలో నిన్నొప్పించగలననే నమ్మకంతో ధైర్యంగా ముహూర్తం పెట్టుకొనమని హామీ ఇచ్చా. నలుగుర్లో నామాట నిలబెట్టు విశ్వం.

విశ్వం: ఎంత మీరు మాటిచ్చినా, పెళ్ళివిషయంలో మిమ్మల్ని అతిక్రమించాల్సి వస్తుంది క్షమించండి!

వెం: (ఉద్రేకంతో) నేను నీ తండ్రిని—ఆ దృష్టిలోనే నిన్ను నిర్బంధిస్తున్నా యేమంటావ్?

విశ్వం: తండ్రి బిడ్డలమీద ఎంతవరకు అధికారం ఉంటుందో అన్ని కట్టుబాట్లకు నేను బాధ్యుణ్ణే. కానీ పెళ్ళి విషయం నా జీవితానికి సంబంధించింది. మీఅధికారం నిష్ప్రయోజనం!

వెం: (దీనంగా) ఆఁ—నీ జీవితాన్ని పెళ్ళిజేసి పాడుజేస్తాననేనా, నీ వనుకోవడం?

విశ్వం: అది నా ఉద్దేశంకాదు!

వెం: ఐతే, యేంటి నీ మూర్ఖం ?

విశ్వం: యిందులో మూర్ఖం యేం ఉంది ?

వెం: వీరారెడ్డి సంబంధం నీకు నచ్చకపోతే—మరొక సంబంధం,

విశ్వం: (నిర్భయంగా) నాకు వీరాదు అడ్డప్రశ్న వెయ్యకండి. నేను సుబ్బారెడ్డిగారి అమ్మాయిని, పెళ్లి జేసుకోవడానికి యెప్పుడో నిర్ణయించుకొన్నా!

వెం: (వస్తున్న కోపాన్ని అపుకొని) ఆఁ...అర్థం ఐయింది. నే విన్నమాటలే నిజమని తేలాయి, తెలిసింది నీ యెత్తు.

విశ్వం: వాళ్లుమాత్రం మనుష్యులు కాకుండాబొయ్యారా?

వెం: వాళ్ళంతస్తు మనంతస్తు ఆలోచించే నిర్ణయించుకొన్నావా ?

విశ్వం: అంతస్తులు, ఆస్తులు, ఆటోపాలు—వాటితో పనిలేదని ఆంతర్యాలకే విలువిచ్చి నిర్ణయించుకొన్నా!

వెం: (దీమాగా) పెళ్ళి కాబోయ్యేముందు, పరిస్థితులేమాతా యోమా ఊహించావా ?

విశ్వం: దైవనిర్ణయం, తప్పించుకోలేంగా !

వెం: నా ఆస్థిలో చిల్లిగవ్వగూడా రాదు తెలుసా ?

విశ్వం: చిల్లిగవ్వగాదు—చిల్లపెంకుగూడా అనవసరం.

వెం: నాతో యే సంబంధం లేకుండా ముగించుకోగలవా?

విశ్వం: మీ కిష్టంలేకుంటే తప్పనిసరిగా!

వెం: యిన్నాళ్ళనుండీ నీవు నామీద కత్తిగట్టే ఉన్నావన్న మాట.

విశ్వం: (భయంగా) అదేంటి నాన్నా?

వెం: (కోపంగా) ఏదైనా అంతే - సుబ్బారెడ్డి కొడుకు దేవాలయ భూమిమీద గవర్నమెంటుకు నడిపినవిషయాల్లో- నీకు భాగంలేదంటావా?

విశ్వం: నాకేగాదు అందులో భాగం, చెప్పాలంటే గ్రామంలో ప్రతి మనిషికీ దేవాలయ భూమిమీద భాధ్యత ఉండాలి. ఆ పిటిషన్లు విషయం నాకు తెలీకపోలే?

వెం: ఐతే తెలిసే ఊరకున్నావన్నమాట?

విశ్వం: న్యాయమాలోచిస్తే ఊరకుండడమేగా!

వెం: అదేనా బిడ్డ తండ్రిపట్ల జేయాల్సిన న్యాయం?

విశ్వం: తల్లికని తండ్రకని యింకొకరికని అనేక న్యాయాలు లేవు. న్యాయానికి ఒక్కటే రూపం—అదే దయ, సత్యం, దైవం!

వెం: (టేబిలుమీద గుద్ది) నీ వేదాంతం నాకనవసరం నీ బుద్ధి మార్చుకోవన్నమాట?

విశ్వం: నా బుద్ధి మార్చుకోవడం అసంభవం!

వెం: జాగ్రత్తగా యింకొకసారి ఆలోచించు. యవరైనా మన బాగునుజూచి వోర్వలేక లేనిపోనివి నూరిపోసి మనస్సు లాక్కొని, నాశనం జేసేవాళ్ళే!

విశ్వం: నే నంత లోకజ్ఞానంలేని మూర్ఖుణ్ని కాదు!

వెం: (కోపంగా) లోకులు నామీద పగసాధిస్తుంటే ఊరుకొంటావన్నమాట?

విశ్వం: తమలోని గుణాలు ఒకరి కుంటాయనుకోవడం, మీ పిచ్చితనం.

వెం: పగలు సాధించేది నే ననేనా నీ ఉద్దేశం?

విశ్వం: కాకుంటే యేంటి కూటికి లేని నిరుపేదలు, దొరికినపూట అర్ధకడుపుతో సంతోషించే అమాయకులు, మీమీద పగబూని యేం జెయ్యగలరని –

వెం: అర్ధకడుపుతో బతికేవాళ్లు (బల్లగుద్ది) ఆకటితో సచ్చే వెధవలు క్షణంలో యంతపనైనా జేస్తారు. లేకపోని వన్నీ నీకు నూరిపొయ్యలే? పెళ్ళిజేసి యీ ఆస్తంతా మింగదామని యేసిన యెత్తు చాలదూ? యింకా ఏం జెయ్యాల పే-ద-లు –

విశ్వం: ఆస్తులుకొరకు ప్రాకులాడేది మీరు. కానీ పేదలు ప్రాకులాడేది, అభిమానం కొరకే. నీతికొరకు ప్రాణాలైనా తెగిస్తారు తెలుసా?

వెం: (కోపం ఆపలేనంతగా) నయాన జెప్పినా భయాన జెప్పినా నామాటలు పెడచెవినబెట్టి నన్నూ నా వంశ ప్రతిష్టను నాశనం జేయడానికి తలపెట్టావనుకొన్నానా? నీలో, తండ్రనే ప్రేమ, ఆదరణ, గౌరవం, ఉంటే నాపట్ల యింత కఠినంగా ప్రవర్తిస్తావా? నా తండ్రి తాతల కీర్తి పోషిస్తావనుకొన్నాను. నువ్వు చదివి నన్ను పెద్దగా ఉద్ధరిస్తావనుకొన్నాను కాని పాలుదాగి పెరిగిన విషసర్పానివి నువ్వు, నా శాంతి గౌరవాలు నాశనం జెయ్యడానికి నా కడుపున బుట్టిన రాక్షసుడివి.

విశ్వం: (పెద్దగా) నాఁన్నా...
వెం: ఆఁ....ఏం?...నువ్వు నన్ను నాయనా అని పిలవడానికి, నీ కర్హత లేదు. (గబగబా) నా రక్తస్పర్శ నీకు నిజంగా ఉంటే_నీ జీవితంమీద నీకు మానాభిమానాలుంటే_ యిప్పటికైనా లోకాన్ని, మనుషుల్ని, అంతస్తుల్ని, అర్థం జేసుకో!
విశ్వం: ఔను...మన తాతలు వాళ్ళవాళ్ళ తాతలు సంఘంలో ఒక ప్రత్యేకమైన స్థానంలోనే బ్రతుకుతూ వచ్చారు నిజమే. యీ భవనాలకోరకు యీ ఆడంబర జీవిత భోగాలకోరకు ఎంతమంది నిర్భాగ్యుల జీవితాల్ని బలిజేసుకొన్నారో, మీ రన్నట్టు తాతల తండ్రుల కీర్తి నిలబెట్టాలి——యీ మాటలో నిర్దాక్షిణ్యంలో సత్యం విల, విలా తన్నుకొంటుంది. శాశ్వతంగా బ్రతక గలమనే నిర్ధారణ జేసుకొని మృత్యుకంకణమైన స్వార్థంతో, యీ లోకపు రక్తాన్ని పీల్చి పిప్పి జేస్తూ న్యాయాన్ని దిగవిడిచి, మీరు జెప్పినట్టు ప్రవర్తిస్తే మీ మనస్సుకు శాంతి గలుగుతుందా? అదేనా మీ ధోరణి?....
వెం: (బల్లగుద్ది) చాలించు నీ అధికప్రసంగం! నీ యిష్ట ప్రకారం, నీ వాడడానికి వీల్లే. తెలుసా? నే నున్నంత కాలం నా కట్టుబాట్లలో ఉండాల్సిందే!
విశ్వం: (ఆవేశంగా) ఎంతవరకు నీ ప్రేమ నామీద ఉంటుందో అంతవరకూ నీ అధికారానికి నేను బాధ్యుణ్ణిగాని,

యెప్పుడు నా జీవితాన్ని అడవిగా జేయాలనుకొని నీ స్వార్థం యెంచుకొన్నావో, నీ పేరుప్రతిష్టలకొరకు, నన్ను నీ కట్టుబాట్లలో ఉంచుకొని, నా జీవితాన్ని సూన్యం, జేయాలనుకొన్నావో, ఆ క్షణంనుండీ నా మీద నీకేగాదు, ఎవ్వరికీ అధికారం లేదు జ్ఞాపకం ఉంచుకోండి !

వెం: (నిట్టూర్పుతో) నా కడుపునబుట్టి నాకే నీతులు, జ్ఞాపకాలు జెప్పేటంతటివాడ వయ్యావురా? యింతవాడ వౌతావని నే నింతవరకూ అనుకోలేదురా విశ్వం—

విశ్వం: పేదపెళ్ళి జేసుకొంటానన్నమాత్రాన, నా ప్రవర్తన పెద్దగా మారిపోయిందనేనా? విశాలమైన ప్రేమ నా జీవితంలో కోరుకొన్నానని మీరు కెరెంగించడంలో జ్ఞానహీనమైన నీతులౌతాయా? నీ బిడ్డగా బుట్టినంతమాత్రాన, స్వాతంత్ర్యంగా ఉండడానికి వీలుపడదనేనా మీ ఉబలాటం? మీ సొత్తు యింతవరకూ తిని పెరిగి, యింకా తింటున్నాననేనా, నామీద మీ అధికారం? అందుకేనా మీ నిరంకుశం? యిదిగో యీ క్షణం నుండీ యీ యింటికి నాకు తెగతెంపులు జేసుకొంటున్నా. మీరు సంపాదించిన సొమ్ములో కుండపెంకు గూడా నా కనవసరం. నేను చిన్ననాటినుండీ యింత వరకూ తిని పెరిగిన సొత్తు, తండ్రికీ బిడ్డకూ మధ్య ఏర్పడ్డ అనుబంధమైన ఋణం మాత్రమే !

వెం: (నిరాశతో) అంతేనా నాపట్ల నువ్వు జూపాల్సిన న్యాయం?

విశ్వం: న్యాయం, అందరిపట్లా ఒకటే-నాకు అనేక న్యాయాలు లేవు. న్యాయానికి ఒకటే రూపం-అదే సత్యంగా ప్రవర్తించడం! అదే నేను జీవితాంతంవరకూ అపేక్షించే ధర్మం. అదే నా కర్తవ్యం. (వెళ్ళిపోతుంటాడు).

వెం: (ఆవేశంగా) ఆగు...

విశ్వం: .... .... ....(ఠీవిగా నిల్చుంటాడు).

వెం: నీ యిష్టప్రకారం పెళ్ళిజేసుకొని సుఖపడ్తావా ?

విశ్వం: ఆ విషయం, మీకు జెప్పినమాత్రం, ఏం లాభం___నా బాగు నాది !

వెం: నీ బాగు నువ్వు జూచుకో నేముందు యెదుటివాళ్ళ పరిస్థితులు గూడా ఆలోచించు.

విశ్వం: ఆలోచించే నిర్ణయించుకొన్నా!

వెం: నా గౌరవాన్ని మట్టిపాలుజేయాలని నిర్ణయించుకొన్నా వంతేనా ?

విశ్వం: మీ అంతస్థుకొరకు నా జీవితాన్ని స్వేచ్ఛారహితంగా జేసుకోలేను, క్షమించండి.

వెం: నువ్వూ ఆ సంఘంవాళ్ళతో కలిసే పగ సాధిస్తావా?

విశ్వం: సంఘంలో చేరినవాళ్ళంతా మీమీద పగలు సాధిస్తున్నారనేనా మీ ఉద్దేశం?

వెం: దేవాలయ భూమి విషయంలో మీ సంఘం కుట్ర పన్నడంలేదా తెలీనట్టుగా మాట్లాడుతున్నావే?

విశ్వం: హుఁ....అన్యాయాన్నెదుర్కోవడం, నిరంకుశాన్ని పాతిపెట్టడం అనే ఆశయాలు మీ దృష్టిలో పగలు, కుట్రలు, కావచ్చు!

వెం: అక్రమాలు, అవరోధాలు, మీ సంఘంవాళ్లు చేయడం లేదేం?

విశ్వం: ఆ విషయం నా హృదయానికే తెలుసు!

వెం: గ్రామంలో నీతిమాలిన కూతలన్నీ కూస్తూ, నా బ్రతుకంతా తూకపానపడుతుంటే హృదయవిదారకంగా వింటున్నావన్నమాట?

విశ్వం: ఒక్కడు జేసేతప్పు ప్రజలు, అక్రమమని నిరంకుశమని తెల్పినంతమాత్రాన నీతిమాలిన కూత లౌతాయా?

వెం: ఐతే....అక్రమంగా, నిరంకుశంగా నేనే ప్రవర్తిస్తున్నానని నీవూ తేల్చావా?

విశ్వం: నే నొక్కణ్ణేగాదు మీ నడవడికలోగల గుణాలు తెలుసుకొన్న ప్రతి ఒక్కనుసిపీ తేల్చగలడు!

వెం: (బల్ల గుద్ది) వళ్లు తెలుసుకొనే మాట్లాడుతున్నావా?

విశ్వం: హుఁ...వళ్లు తెలీకుండా మీరుజేసే కార్యాలకు ప్రతిఫలం అనుభవించాల్సి ఉంటుంది—ఆఁ—తండ్రనే వాత్సల్యంతో మరొకసారి చెబుతున్నా!

వెం: (పట్టరాని కోపంతో) ఆఁ...ఏమన్నావ్?

విశ్వం: నిజమే అన్నా!

వెం: నిజంగా నేను తండ్రిననే దైవత్వంతోనే నీ ప్రవర్తన సాగిస్తున్నావా?

విశ్వం: న్యాయా న్యాయాలను అనుసరించి తప్పకుండా!

వెం: నీ న్యాయప్రబోధంతో ప్రపంచాన్ని బాగుపరస్తావా?

విశ్వం: (దీమాగా) వీలైనంతవరకూ తప్పకుండా?

వెం: ఐతే—నీ ఉద్దేశాలు మార్చుకోవన్నమాట?

విశ్వం: యిప్పటికైనా మీ ఉద్దేశాలు మార్చుకోండి—లోకాన్ని అర్థంజేసుకోండి. మీ అధికారాన్ని చలాయించి కొంతమంది నిర్భాగ్యుల్నిమాత్రం, మీ అదుపులో పెట్టుకోగలరు. మీ డబ్బుతో వ్యక్తిత్వం, కోల్పోయిన మనుషుల్నే కొనగలరు కానీ మున్ముందు కాలాన్ని...యీ క్షణంసేపైనా ఆలోచించండి....

వెం: చాలించు....మున్ముందు నీ పరిస్థితి నీ సంఘం పరిస్థితి యేమవుతాయో ఒక్కసారి ఆలోచించు, చాలు!

విశ్వం: మీరు నా జీవితాన్ని తారుమారు జేసినా, లోకాన్ని మెప్పించగలరు, మీరు సంతోషపడగలరు. కానీ సంఘంపట్ల ప్రజలపట్ల మీ ద్వేషం నిష్ప్రయోజనం. మహా సముద్రంలాంటి ప్రజల దృష్టిలో మీరు తృణ ప్రాయంగా గూడా లెక్కపడరు తెలుసుకోండి!

వెం: (బల్ల గుద్ది) ఆఁ .... చాకిరిజేసి పొట్టనింపుకోవాల్సిన యెదవల గుంపంతా సంఘాలు—ప్ర-జ-లు.

విశ్వం: పేదలు ఆకటితో కృశించి వెన్నంటిన పేగుల్తో అహో రాత్రులు కష్టించి కూడ్చుకొంటున్న సిరిసంపదను, స్వార్థపరాయణత్వంతో, అక్రమంగా దోచుకొని అను భవిస్తున్నాం! యింకా యెన్ని రోజులీ నిరంకుశం? చాకిరి జేసి జీవించేవాళ్లు మనుష్యులుగాదా? మా రాజులకున్నంత లవినీతి ఆలోచనాశక్తి పేదలకు లేద నేనా? ధనం, భూములు ఉన్న మనబోటి మారాజుల కేనా సంఘాలు, సన్మానాలు, గౌరవాలు ఉండా ల్సింది—అంతేనా మీ ఉద్దేశం?

వెం: చాలించు...విన్నంతవరకు చాలు వేదాంతం. ఆ ఫుండా కోరి సుబ్బారెడ్డి, వాడి కొడుకు నిన్నేమాత్రం బాగు పరస్తారో చూదాం?

విశ్వం: యీ స్వేచ్ఛలేని నరకకూపంనుండి బైటపడితేచాలు- బాగుపడేది, పడంది తర్వాత దైవ నిర్ణయాలు!

వెం: దొంగముండాకొడుకులు పొలంలో చేను, ఊళ్ళోయిల్లు లేని గాడిదకొడుకులు నిన్ను మాయచేసి కూతుర్ని కట్టబెట్టి ఆ సంతా మింగెయ్యాలని యేసిన యెత్తు బాగా పారింది!

విశ్వం: (ఆవేశంగా) హుఁ...ఆస్తులకొరకు, అంతస్థులకొరకు కన్న తల్లినైనా తండ్రినైనా, కట్టుకొన్న భార్యనైనా, కడకు కడుపున బుట్టిన బిడ్డల్నైనా హింసించేది కలిగిన వాళ్ళే...ఆస్థులకొరకు స్నేహాలు, దగాలు, హత్యలు చేయించేది ఉన్నవాళ్ళే. కానీ పేదలు ఆస్తులకొరకు,

గౌరవాలకొరకు వాళ్ళు వాళ్ళను వంచించుకోరు. విశాలమైన హృదయంతో దయ, ధర్మం, సత్యం అపేక్షిస్తారు. అవే వాళ్ళ వెలలేని ఆస్తులని నమ్ముకొంటారు.

వెం: (పట్టరాని కోపంతో చెయ్యెత్తి కొట్టబోతాడు) ఆఁ—

విశ్వం: (ఉద్రేకంగా నిష్క్రమిస్తూ) యికమీదట యీ గుమ్మం తొక్కను—నువ్వే అనుభవించు ఇంద్రభోగం చిల్లిగవ్వ సొత్తయి నా కనవసరం! (వెళ్తాడు)

వెం: (పిచ్చిగా పెద్దగా) ఆఁ....పోతున్నావా? నన్ను నేను అవమానం జేసుకోలేను. ఆ కటిక దరిద్రుడి కూతురు నీకు భార్య కావడానికి వీల్లేదు — వాణ్ని వాడి వంశాన్ని నాశనం జేయిస్తా (సోఫాలో కూలబడతాడు)

[తెర వాలును]

# రెండవ అంకము

[మొదటి సీనులాగే రెడ్డి మేడలో గది. రెడ్డి సోఫాలో కూర్చొని డ్రాయర్‌లో బ్రాందీ సీసా తీసి గ్లాసులో పోసుకొని తాగి, మత్తుగా, నిషాలో తూలుతుంటాడు. తెర లేస్తుంది. పనిమనిషి కాంతమ్మ కాఫీ తెచ్చి టేబిలుమీద పెట్టి పోతుంటుంది.]

వెం: (నిషాలో ఉలిక్కిపడి) ఏంఁవేఁ.... కాఫీ తెచ్చావఁట్నే?

కాం: (రెడ్డివైపు మళ్ళి, భయంగా) అవిగోనయ్యా టేబిలు మీదుంచాను!

వెం: నా-కళ్ళు గుడ్డిగాదులేవే, కాఫీ టేబిలుమీంద కనబడ తానే ఉండాయ్—యిలారా—

కాం: (వణుకుతూ చేతులు నలుపుకొంటూ సమీపించి) ....

వెం: ఏంఁవేఁ—యియ్యాళ నువ్వొచ్చావ్? నీ నాయినేడే?

కాం: వంట్లో సరిగా లేదంట అందుకని, యియ్యాళ పనికి నే నొచ్చా...

వెం: ఆఁ....పోనిలే నారయ్య ముసలోడయ్యాడుగా. యిక పనికి నువ్వే వస్తుండు!

కాం: (సిగ్గుతో).......

వెం: ఏంవేఁ కాంతా, యింకా యెన్నిరోజులు పెళ్ళి జేసుకోక ఉంటావే!

కాం: (సిగ్గుతో) దేవుడు సక్కంగా సూస్తే పెళ్లి దేంది లేండి!

వెం: అబ్బో—(వికటంగా నవ్వి) మాటలుభలే బాగా నేర్చు

కొన్నావే! నీకు మంచి మొగుణ్ణి చెయ్యాలని——పాపం నారయ్య చదువుకూడా చెప్పించాడు. ఆఁ——

కాం: మాబోటోళ్ళ చదువెందికే అయ్యిగారు, వానాకాలం చదువు!

వెం: హ్హాఁహ్హాఁహ్హాఁహ్హాఁ——ఏఁం బైవేఁ నాదగ్గర, రా కూర్చో. (కుర్చీ చూపుతాడు)

కాం: (భయంతో వణికిపోతూ) నేను——ప-నిమనిషిని!

వెం: ఏఁం పర్వాలేదులే వే, రా-

కాం: మీరు బ్రమపడుతున్నారండీ! (గద్గదస్వరంతో)

వెం: (సోఫాలోనుండి లేచి కైపులో పడబోయి బెంచిపట్టుకొని) నాకు భ్రమాలేదూ గిమాలేదు భయపడకుండా రావే!

కాం: (దూరంగా జరుగుతూ) ఏఁటండీ మీ ధోరణీ!

వెం: హాహాహాహా - బొబ్బ... బొబ్బో ధోరణి పతివ్రతవా? ఏఁవేఁ? (మీదికురుకుతాడు)

కాం: (కంగారై, పారిపోవడానికి సిద్ధమై) ఆఁ...తప్పండి, తప్పు.

వెం: తప్పు లేదూ ఒప్పు లేదు, తలుపు వేసుంచాయి గదూ? (పట్టుకోబోతాడు తప్పించుకొంటుంది)

కాం: (కోపంగా) మీరు పెద్దవాళ్లు గదా? ఏంటండీ యీ బుద్ధులూ?

వెం: కోప్పడుతుండావా - ఆఁ - యెందుకే అంతకోపం?

కాం: పేదవాళ్ళకోపం, పెదాలకు చేటని, మాబోటోళ్ళ కోపం మిమ్మల్నేం జేస్తుందండీ!

వెం: (నిషాలో తూలుతూ) ఛా నువ్వు పేదదానవా (జోబులో నుండి డబ్బుతీసి యివ్వబోతూ) యిదిగో నే డబ్బు - యిదిగో - రా.

కాం: డబ్బు. మా కెందుకు మీదగ్గరే ఉంచుకోండి. కడుపు జరక్క మీ నౌకరికి కుదిరి, అష్టచాకిరి చేస్తున్నది చాలక మానాన్నిగూడా అవమానించుకొని జీవితాన్ని మంట గలుపుకోమంటరా? మీకు డబ్బే మానాభి మానాలు, డబ్బుకొరకు. యేపనికైనా వడిగడతారు - కానీ మాబోటి పేదవాళ్ళకు, రక్తమైనా భాగ్యమైనా భోగమైనా, నీతి, నిజాయితీ, మాత్రమే!

వెం: సెభాస్....అనర్గళంగా ఉందే నీ లెక్చర్, యింత పాండిత్యం ఉందని నేను కల్లోగూడా అనుకోలేదే - డబ్బోబ్బద్దనేనా నీ ఉపన్యాసం, యీసారికి నే నిస్తున్నా తీసుకో (నిషాతో చేతిలో నోట్లు పైనిసిరేస్తాడు)

కాం: (క్రిందబడ్డా నోట్లల్లో ఒక నోటితీసుకొని ఆవేశంగా) యక్కడి దీ డబ్బు - యెవరి దీ డబ్బు? తోటి మానవులు కాయికష్టంజేసి, అసువు లరగంగా చేకూర్చిన శ్రీ సంపదనంతా నిరంకుశంగా, నిర్భయంగా దోచుకొంటూ, మీతాగుడుకు మీ కార్లకు, మీ అష్టయిశ్వర్య భోగాలకు, వినియోగించుకొంటున్నా రంతేనా? నువ్వు నామీద దయతలపి ఔదార్యంతో యిసిరి

పారేసిన యీ డబ్బు యేరుకొని - నా శరీరాన్ని మీ కప్పగించమనేనా? యివేనా మీ పెద్దమనిషి కుండాల్సిన గుణాల లక్షణం?

వెం: (తూల్తూ) ఛా...లా ధనమాటలూ నువ్వూ, తప్పించుకొని పోతావా? యిలారా - ఆఁ (పట్టుకోబోతాడు దూరంగా జరుగుతుంది)

కాం: (కోపంగా) యీ ద్రోహపు కార్యాలకు, యీ అవినీతి ప్రవర్తనకు మీ దోపిడి నటనకు తగినశాస్తి ఒక్క రోజు మీకు జరగక మానదు. ఆరోజు మీరు దైవాన్ని అతిక్రమించలేరు, ప్రజల్ని ధిఃక్కరించలేరు, జ్ఞాపకముంచుకోండి?

వెం: (తూల్తూ మీదికురికి) ఏఁంటే—లంజా, కూస్తావ్

కాం: కడుపు చాతపట్టుకొని నుదిటి చమట దీసి మీ చాకిరి జేస్తున్న పేదవాళ్ళంతా మీ దృష్టిలో లంజలు— యధవలు—మీబోటి మారాజులంతా పెద్దమనుష్యులు, పతివ్రతలు, మీ రెంతకలిగినవాళ్ళైనా, యెంత తాగి కైపులో ఉన్నా, మర్యాదగా మాట్లాడడం నేర్చుకోండి!

వెం: జాగ్రత్తగా మాట్లాడు వళ్లు తాటలొలిచేశాస్తా! (పట్టుకోబోయి వళ్లు తెలీక టేబిలు పట్టుకొంటాడు)

కాం: (భయంగా) మీరు తలుసుకొంటే నా వళ్ళు తాటలు తీయడమేగాదు, నన్నీవేళ ప్రాణమైనా తీస్తారని నాకు తెలుసు!

వెం: ఓ—యబ్బా యంత నంగనాచివే, లేనిపోని భయంతో నటించి మర్యాదగా పారిపోవాలనేనా నీయెత్తు-ఆఁ—!

కాం: నీబోటి రాక్షసుడి చేతిలో మానాన్ని అవమానించుకొనే టంత నీతిమాలినదాన్ని గాదు నేను. నన్ను చెరచడానికి నీవల్లాగాదు తెలుసా?

వెం: హాహాహాహా-హాహాహాహా-తాటాకు శబ్దంతో కుందేళ్ళను భయిపెట్టగలవు గాని పెద్దపులుల్ని గూడా భయిపెడ్తావట్నే?—ఆఁ—సావిత్రివా? లేకుంటే దమయంతివా? నన్ను శపించి పారిపోవడానికి!

కాం: నా ప్రాణాలైనా వదుల్తాగాని నీకు నేను వంగిపోను!

వెం: నేనేం జేసినా యిక్క డెవరడ్డపడ్తారే?

కాం: కాబట్టేగా మీ మాటలకు అడ్డూ ఆపూ లేకుండా వుండడం! మీ చేతలకుమాత్రం యవరడ్డమొస్తారు? (భయంగా) మీకు పుణ్యముంటుంది నన్నొదిలేద్దురూ?

వెం: (వికటంగా నవ్వి) భలే బాగా అన్నావే-పున్నాలకి పాపాలకీ సమయంగాదే యిది-సంతోషానికే పిచ్చిదానా దిల్ ఖుషీ-ఆఁ, ఏమంటావ్?

కాం: నీ సంతోషం కొరకు నా మానాన్ని పాడుజేసి ప్రాణాలు తీస్తావా?

వెం: ఛా—నీ ప్రాణంతీసి, శవంతోనా నేను సంతోషించేది, అపశకునం పల్కాకే పిచ్చిదానా! సుఖపడే సమయం వదలుకొంటావు దేనికే?

కాం: (ధైర్యంగా) నా ప్రాణంతీసి నా శవంతో నీ ముచ్చట తీర్చుకోండి, కానీ నేను బ్రతికుండగా, నన్నవమానించడం కల్ల.

వెం: (పైకుడకుడుతూ) ఏం శభధమే-ఛా-ఆల్ రైట్ గాలేదే, నీమాట, మనిషికి చేతగాందంటూ ఉందంటే, మొత్తి మొగమా!

కాం: (జాలిగా) యిదేనా మీాచేతనైంది? పరాయి ఆడవాళ్ళను, దౌర్జన్యం జూపించి మానాన్ని చరచబోవడం?..

వెం: మనసు, మనసు కలిస్తే పరాయివాళ్ళేమిటే – సప్పిడి మొగమా!

కాం: నీ భార్యతో నీ ముచ్చట్లు మీావాళ్లెవరైనాఉంటే వాళ్ళతో నీ సంతోషం, నన్నన్యాయం జేయకు!

వెం: దొంగముండా, రానురాను నీమాటలు మితిమీారుతుండాయ్–నావాళ్ల మాటే త్తేటంతటిదానవయ్యావంట్నే?

కాం: పొట్టజరక– నీయింట్లో పని కొప్పుకొన్నంతమాత్రాన నీ అవినీతి పని బాగుందా? నోటిగుండా న్యాయాన్ని కదిపితే మీా దృష్టిలో నేరమేనా? మా రాజు ఏలాంటి ద్రోహానికైనా....

వెం: ఆఁ .... నోర్ముాయ్ (వేగంగాబోయి బలవంతంగా పట్టుకొని) నిన్నేం జేస్తానో చూడు.

కాం: (తప్పించుకో డానికి ప్రయత్నిస్తూ) ఓరే.... రాకుసుడా, నన్నొదులు నీకు హృదయంలేదూ? నువ్వు మనిషివి

గాదూ? నీకు రక్తంలేదూ, దున్నపోతులా ప్రవర్తిస్తావా, విషంతో నిండిన సర్పానివి నువ్వు...

వెం: హా హా హా హా హా-పిల్ల శాపాలకు ఉట్లు తెగతాయన్నే ధగిడీముండా?

కాం: నీ చేతుల్లో పుండుబుట్టా. దుర్మార్గుడా, క్రూరుడా, నన్నొదులు, (చెయ్యికొరికి తప్పించుకొంటుంది.)

వెం: (చెయ్యి చూచుకొంటూ) ఓసే, లంజా నెత్తురొచ్చేటట్టు కొరికావ్? నీ ప్రాణంతీస్తా జాగ్రత్త.

కాం: (టేబిలుమీద కాఫీ మొహం నిండుగా కుమ్మరించి, పరుగెత్తుకొని వెళ్ళిపోతూ) ద్రోహపు గాడిదకొడకా?

వెం: (తన్ను తాను సంబళించుకొంటూ) యెంతపని జేశావే అంకారపు లంజాముండా. యింత పరాభవం జరగద్దని నేను కల్లోగూడా అనుకోలేదు! కులం తక్కువ ముండ, ఏం మొప్పదెచ్చి పెడుతుందో (తూలుతూ లోపలి కెళ్లుతాడు. కొన్ని క్షణాలకు గున్నయ్య ప్రవేశం.)

గు: (ముక్కుపొడి పీలుస్తూ) రెడ్డి లోపల లేడేం కర్మ-లేకుంటే యీదెబ్బతో సచ్చాసన్నమాటే, (అటు యిటు తిరుగుతూ) ఆ సచ్చిన ముండాకొడుకులు తాగి తందనాలాడేటప్పుడు, విషయాలు బోధజేసి పంపిచ్చా, యింతకూ కార్యాన్ని సక్రమంగా ముగించారా, సరే, సరే-అట్లాగాకుండా కథ అడ్డాం తిరిగిఉంటే ముందు

నా పీకమీద కొస్తుంది, యిదే ప్రపంచంలో, అంటే నేటి పరిపాలనలో బ్రతకాలంటే మంచిని కూనీ జెయ్యాలి. లేకుండా మహాకవి జెప్పినట్టు లోకాన్ని ప్రేమించి న్యాయంగా ప్రవర్తించామంటే, కడుపుకు కూడు దొరకదుగదా మంచినీళ్ళకు గూడా అర్చ కాడాల్సిందే, తప్పదురా, బాబు (ఒక్క–నిట్టూర్పిడిచి) తప్పదు....

వెం: (నవ్వుతూ ప్రవేశించి) ఏంటయ్యో గున్నయ్యా! తప్పదవి జడ్జిమెంటిస్తున్నావ్. (సోఫాలో కూర్చుంటాడు).

గు: (చేర్‌లో కూర్చుని పొగ పీలుస్తూ) ఆం...తప్పుతుందేం మరి ఆ సుబ్బారెడ్డిగాడు యీసారి ఆ మరణదేవతకు బలిగావడం, నాన పీడ తొలిగించుకోవడం తప్పుతుందంటారా ?

వెం: (సిగరెట్టు ముట్టించి ఆలోచనగా పొగపీలుస్తూ) అట్లానా?....పీడ తొలిగేటట్లు శిద్ధపర్చావన్నమాట ?

గు: (సంతోషంగా) చెప్పింది చెయ్యకుండా, చేసింది చెప్పకుండా ఉంటే మాలాంటి పెద్దమనుష్యులదగ్గర కాస్తంతైనా పరు ఉంటుందా ?

వెం: (టేబిలుమీద గుద్ది) వాడి వంశాన్ని వేళ్ళతోసహా పెకలించినంతవరకూ, యీ వెంకట్రామిరెడ్డికి కన్ను కొరకని దృష్టనుకో గున్నయ్యా! వాణ్ణి మన కళ్ళముందర నుండి తొలిగించుకోవడంగాదు నేర్పు. వాడి కొడుకునూ కూతుర్నీ సఫా జేయాలి తెలిసిందా?

గు: (గుండెమీద చెయ్యివేసుకొని) అమ్మో .... మరంత ఘోరానికే?

వెం: ఏం ... యింతవరకూ అన్ని కార్యాలలో, నాతో సమానంగా ఉత్సాహం జూపుతుండి, ఆఖరుకు యీ చిన్నమాటకే భయపడి కుంగిపొయ్యావ్!

గు: (లేని చిరునవ్వు నవ్వి) ఆఁ .... మీ అండ నాకుండగా నాకేఁవండీ?

వెం: (ఆదుర్దాగా) యీ విషయంలో మునిగి అసలు గొడవ మరిచా?

గు: ఏంటండీ—అంత చిక్కైన గొడవా?

వెం: ఆఁ—పాపానికిపోతే మనిషికి కష్టాలు తప్పుతాయా?

గు: యవరండీ—మీ మనస్సు నొప్పించేటట్లు ప్రవర్తించింది?

వెం: (నిరుత్సాహంగా)కూటికి మాడిసచ్చే దరిద్రుల్ని ఆదరించి పనిచ్చి ఆకలితీర్చడం పెద్ద తప్పు నాదే....విశ్వాసం లేని కుక్కలు!

గు: (ఆదుర్దాగా) మీరనేది ఆ నారయ్యగాడి విషయమేగదూ?

వెం: ఆఁ....

గు: ఐనా—వాడికి తలంతా పొగరే, ఎధవకు!

వెం: (జాలిగా) నువ్వనుకొన్నంత దుడుకు మనిషికాదు నారయ్య, పెద్ద ముండాకొడుకు, నా చిన్ననాటినుండీ యీ యింట్లో ఎంతో నమ్మకంగా మెలుగుతూనే ఉన్నాడు పాపం?

గు: (ఆదుర్దాగా) మరేవరి విషయం మీారు....

వెం: అదే—నారయ్య కూతురు -

గు: ప్చ్....ఏం ఉంది ఆ నారయ్య నమ్మకాన్ని పాడుచేసింది పాడుముండ!

గు: యింతకూ సెలవిచ్చారుగాదు - ఏం జేసిందో?

వెం: నారయ్యకు వంట్లో సుస్తనీ... యివాళ పనికొచ్చింది...

గు: (ఆదుర్దాగా) ఆc...వస్తే,

వెం: వచ్చింది వచ్చినట్టు పోక డ్రాయర్లో తాళాలుతీసి బీరువాలో ఉన్న ఐదొందలు రూపాయలు దొంగతనం జేసి. తుర్రుమన్నది!

గు: (గుండె కొట్టుకొంటూ) అమ్మో-అయ్యో - మనింట్లోనే దొంగతనం - ఎంత ధైర్యం, ఆడముండకు ఎంత సాహసం?

వెం: (సునాయాసంగా) ఆc....యధవ డబ్బు పోతేపోయింది—

గు: ఏంటండీ—యివేళ వంకాయల దొంగతనం రేపు బెంగాయిలు వగకూ పోతుంది. తగినశాస్తి జెప్పి డబ్బు రాబడితేగాని కులం తక్కువజాతి భయంగా బ్రతకరు— తెలిసిందా, ఏవంటారు?

వెం: (జాలిగా) నారయ్య నమ్మకాన్ని జూచి జాలిపడాల్సొస్తుంది....

గు: దేహీ అని అడిగితే, పదిరూపాయలు ధర్మంగా పారేసేవారు గదా? అలా దొంగకూటి కాశిపడి నమ్మకం

పోగొట్టుకోవడం, ఎందుకండీ? రెండోరోజు ఏమొఖం పెట్టుకొని మీలాంటి పెద్దమనుష్యులను చూడాల, — ఒకాళ ఎంత డబ్బు కాశపడ్డా నీతి నీమాలు లేకపోతే సరా, వీళ్ళను జాలిగావిడిస్తే మనకే పాపం చుట్టుకొంటుంది!

వెం: యీ దొంగతనం విషయం మనం కలుగజేసుకుంటే గ్రామంలో పరిస్థితుల్నిబట్టి, అనేక యిబ్బందులు రావచ్చు, అందుకని పోలీసురిపోర్టు యిచ్చిపెడితే దేనికైనా మంచిదికదూ?

గు: అదే నేననుకోవడం గూడా, మీ ఉద్దేశం ప్రకారం చేస్తే సరిపోతుంది వాళ్ళయితే గుండెలు పగిలేట్టు తన్నేరంటే గుణం కుదుర్తుంది.

వెం: ఏంచవిట్లో కాసకూ, కూస్తకూ పోలీసు రిపోర్టులు జేయడం మనకే లోపం!

గు: మీరు యీ విషయంలో పశ్చాత్తాపం జూపడం నా కిష్టంలేదండీ—ఆఁ—

వెం. నాకుమాత్రం. యిష్టం వేఁవిటి—యింతటితో ఊరకుంటే తిన్నయింటి వాసాలు లెక్కబెట్టే, విశ్వాస ఘాతకులు యంతపనికైనా వడిగట్టగలరు.

గు: మన్లో మాట—ఆడముండేదో బుద్ధి గడ్డి తిని నూపాయి లెత్తుకుపోయిందనుకోండి—పెద్దోడు నారయ్య దారికిందే చాలని, దీమాతో ఉండొచ్చా? అదేనటండీ వాడి విషయంలో మీకున్న నమ్మకం?

వెం: ఆఁ....కూటికి లేనంత కాలమే నమ్మకంగా, మన కాళ్ళ దగ్గర పడుంటారు అల్లా గాకుండా గంజితోనైనా పొట్ట నింపుకొన్నారంటే, వళ్లు తెలీకుండా ప్రవర్తించే కులంతక్కువ ముండాకొడుకుల విషయం, వేరే చెప్పాలా?

గు: 'పాత్రమెరిగి దానం జెయ్యమన్నారు పెద్దలు' పేరూ ప్రతిష్టా లేకుండా ఐదొందల రూపాయలు, యేట్లో బొయ్యడం చాలా పొరపాటు, డబ్బపహరించిన దొంగలు మన కట్టుబాట్లలో ఉన్నప్పుడు తగినశాస్తి జేయకపోతే, అలుసు దేలిపోతుంది.

వెం: యింతకూ కర్తవ్యం ఆలోచిస్తున్నా—

గు: ఒకటే కర్తవ్యం పోలీసు రిపోర్టు జేయడం!

వెం: ఆలశ్యం, అమృతం విషమని చేసేపనేదో త్వరగా చేస్తే సరిపోతుందిగా?

గు: (పొగడ్తతో) ఒక జాబు యినస్పెక్టరుకు వ్రాశారంటే చాలదూ? మీ సొమ్ము మీ కప్పగించేటంతవరకూ నిద్రపోతాడాంట?

వెం: ఇనస్పెక్టరుదగ్గర మనకెంత సనువుంటేమాత్రం, రిపోర్టు విషయాలు జాబులు, ఉత్తరాలు రాయిడం భావ్యం గాదు. కాబట్టి నువ్వేస్వయంగా వెళ్ళి రిపోర్టు వ్రాయించి రావాలి.

గు: (ఆలోచన).............

వెం: ఏంటి క్షణంలోనే అంతాలోచన?

గు: ఆఁ...ఆలోచనేఁ లేదండీ!

వెం: ఐతే—యిక జాగెందుకు?

గు: అంతకన్నానా - నేను తప్పకుండా వెళ్ళి, ఆ నమ్మక ద్రోహుల విపరీతాన్ని విభజనగా రిపోర్టులో వ్రాయించి యినస్పెక్టర్తో స్వయంగా మాట్లాడి రానూ? ఏంవఁను కొన్నారో?

వెం: మరిచా—రిపోర్టులో కొన్ని నగలుగూడా ఉదహరించు!

గు: (ఆశ్చర్యంగా) దొంగతనంబొయ్యింది డబ్బేనంటిరే?

వెం: నా ఉద్దేశం, ఐదొందలకే పోలీసు రిపోర్టివ్వడం, మనం తర్థుకే లోటుగా ఉంటుందని...అందువలన డబ్బుతో, నగలూ అంటే బాగుంటుందిగా?

గు: (విధిలేక) సరే, రిపోర్టును మీరాయిష్ట ప్రకారమే వ్రాయిస్తా లేండి!

వెం: (నేర్పుగా) ఎట్లా ఉంది మన యెత్తు?

గు: (బలవంతంగా నవ్వి) మీరొక విషయాన్ని పొందుపరచా రంటే సామాన్యులకు అర్థమౌతుందా? ఏంవిటి?

వెం: 'నువ్వు నేర్పినవిద్యే నీరజాక్ష' అన్నట్లు తమరి గురుత్వ మేగా యిదంతా!

వెం } : హ్హా, హ్హాఁ, హ్హా, హ్హా.
గు }

వెం: (కోపంగా) ఐనా దారుబోతుముండకు అంత చెయ్యి చుడుకా చేతకి ఇద్దూ ఆపూ లేదని,

గు: ఐదేండ లేగదా? మన రెడ్డిగారు గుర్తుంచుకోపోతాడా? అనుకొనుంటుంది— పాపం!

వెం: పోలీసుల చేతులో చిక్కించి, పక్కటెముకలు యిరిపించం దేగాని - ఆ లమ్డీముండకు తల తిక్కకుదిరి జాగ్రత్తగా, వినయంగా, మెలగడం చేతగాదు, అంతే దాని తలవ్రాత.

గు: (కుర్చీలోనుండి లేచి) యిక నేను సెలవు తీసుకోనా?

వెం: మరొకమాట, మొన్న నువ్వు చేబొదులడిగిన పైకం విషయమే మరిచా. రేపు తప్పకుండా నన్నడిగి పుచ్చుకో!

గు: డబ్బవసరం, ఆనాడే తప్పిపోయింది. అంతా మీ దయ. ఆమాత్రం జ్ఞాపకంఉంటే చాలు.

వెం: (లేనిపోని ప్రేమతో) నీకేం అవసరమైనా తప్పకుండా అడిగి పుచ్చుకో, నా దగ్గర నీకు భయమెందుకు?

గు: (సంతోషం పట్టలేక) మీరున్నంతకాలం, యీ యిల్లు పరాయిల్లా? ఏలంవిటి అమ్మనైనా అడగందే పెట్టదన్నట్లు, ఏ అవసరమైనా మిమ్మల్నడిగి తీర్చుకోవాలి గాని లేకుంటే ఒక్కక్షణం సాగుతాయా మా సంసారాలు!

వెం: నా పరిస్థితులకు నీ సలహా లేకుంటే నా మనస్సు చెప్ప లేనంత ఆందోళన భరించాల్సి ఉన్నా!

గు: (గర్వంగా) అంతా దైవకృప లేండి — కాకుంటే నా సలహాలు, ఏం పని జేస్తాయనీ ?

వెం: (ఒక నిట్టూర్పువిడచి) కడుపున బుట్టిన బిడ్డ నాకు దూర మౌతాడనుకొన్నానా? గ్రామంలో పరిస్థితులు, నా చేతిని మించిపోతాయని నా కల్లో గూడా తలవలేదే!

గు: మనమనుకొన్నట్లు కార్యక్రమం బిగిసిందంటే వ్యవహా రాలన్నీ ఒకదారి కొస్తాయిలేండి ?

వెం: ఏం వ్యవహారాలో అన్నీ — అయోమయంగా తల లెత్తాయి, యింక నువ్వా ఆ పోలీసు రిపోర్టు విషయం, ముగించుకరా, ఒక బాధ తీర్తుంది!

గు: గోరుచుట్టుమీద రోకటిపోటని, యీ పరిస్థితుల్లోనే, యీ దొంగతనం ఒకటి తగలబడ్డది- ఏం జేదాం? యీ జిడ్డు వ్యవహారాలన్నీ ఒకటే సారొచ్చి ముంచే స్తున్నాయ్

వెం: (సోఫాలోనుండి లేచి) ఆం.... యినస్పెక్టరు, నెలక్రిందట, బిడ్డపాలకు ఒక ఆవు అవసరమని అడిగాడు రేపే తోలి పెడ్తానని చెప్పు.

గు: ఆలాగే _ నే నొస్తానండీ!

వెం: (చిరునవ్వుతో) ఆం-

గు: చిటికెలో రానూ! (నిష్క్రమిస్తాడు)

వెం: (అటు యిటు తిరుగుతూ) చేసిన తప్పు సమర్థించుకోవ డానికి పన్నిన పన్నాగం నా తలమీదకొచ్చి పడు తుందేమో-కర్మ-నా పగతీర్చుకొంటూ, ఎన్ని విపరీ తాలు సంభవించినా నా శత్రువుల నెత్తుర కళ్ళ జూడందే నా మనస్సుకు శాంతి దొరకదు నా జీవి తానికి క్షేమమూ లేదు -

గు: (గాబరాగా పరుగెత్తుకొంటూ వచ్చి) వస్తున్నాడండీ - వా డొచ్చేస్తున్నాడు.

వెం: (ఆదుర్దాగా) ఆం....యవరయ్యా ?

గు: (నోటమాట రాక) వా-డే-నండీ-వాడే-వాడే

వెం: (వికటంగా నవ్వి) ఏంవిటయ్యా నీ బెదురు - వాడు వాడు అంటే వాయుదేవుడా ఏం?

గు: ఆ వెధవే సుబ్బారెడ్డిగాడు !

వెం: (ధైర్యంగా) హుం...నువ్వు జేసిన పన్నాగం అంతా బూడిదలో పోసిన పన్నీరై పోయిందన్నమాట?

గు: సఫా జేస్తే నే - బహుమానం అని బోధ జేసి, మీ రిచ్చిన డబ్బిచ్చి పుల్లడ్ని, గండడ్ని, అలా పంపించి, యిలా వస్తున్నాను. వచ్చానో లేదో మల్లా వాడు ప్రాణాల్తో బైటపడినాకు ప్రత్యక్షం - ఛా కధ అడ్డాం తిరిగిందీ_

వెం: (విసుగ్గా) చేతగాని ముండాకొడుకులు అవ్యక్తంగా ప్రవ ర్తించి కొంపమీదకు తీసుకొస్తుంటారు !

గు: (భయంగా) నే నిలా ఔతుందని అనుకొన్నానా అండీ ?

వెం: యిందులో నువ్వేం జేశావయ్యా? ఆ గుండెలేని ముండా కొడుకులు గండడూ, పుల్లడూ సుబ్బారెడ్డిగాణ్ణి ప్రాణాల్తో విడిచిపెట్టారే అని - అంతే!

గు: ఐతే - సుబ్బారెడ్డిగాడు యిక్కడికొచ్చేస్తున్నాడే!

వెం: సిగ్గులేని ముండాకొడుకు - నా యింటికీ వస్తాడు, ఏ కూటికైనా పాల్పడతాడు. అందితే జుట్టు లేకుంటే కాళ్ళు పట్టుకొనే రకం!

గు: ఏ ముఖం పెట్టుకొనొస్తున్నాడో మీ ముందుకు. మాయమాటలు అబ్బాయికి బోధించి, మీ మాట యినకుండా జేశాడు. పైన మీ మీద లేనిపోని నేరాలు ప్రజలకి బోధ జేయడం - అబ్బే-మనిషేనా?

[వెంకట్రామిరెడ్డి సోఫాలో కూర్చుని సిగరెట్టు పొగ పీలుస్తుంటాడు. గున్నయ్య అటూ యిటు తిరుగుతుంటాడు. సుబ్బారెడ్డి తలగుడ్డ, బనీను పంచె గట్టుకొని చేతిలో కఱ్ఱతో ప్రవేశం.]

గు: (ఆశ్చర్యంగా) ఆc....సుబ్బారెడ్డిగారా?

వెం: (కుట్రగా) హుc....యిప్పటికి లోకం తెలిసింది పాపం!

సు: (ఆవేశంగా) తలలు తెగబోయ్యేటప్పుడైనా ప్రజలు లోకం తెలుసుకొంటారు లేండి!

గు: (సుబ్బారెడ్డి నుద్దేశించి) అనుకోని రీతిగా వచ్చేశావు కూర్చోకుండా నిలబడ్డా వెందుకయ్యా?

సు: నేను నీలాగు కూర్చొని వినాశనానికి దారితీసే కుట్రలు, ఆలోచన జేసేవాణ్ణి గాదు, అంత మర్యాద నా కనవసరం!

గు: ఆఁ–ఆన్నా, ఊఁ–అన్నా, అన్నీ యిబ్బందులే నీ దగ్గర. నోటికొచ్చినట్టు మాట్లాడేస్తావ్—ఐనా నాకెందుకూ!

వెం: చూడు సుబ్బయ్యా....మర్యాదిచ్చి మర్యాద తీసుకోమన్నారు, ఎందుకలా నోరు పారేసుకొంటావ్?

సు: ఏనుగెళ్తుంటే కుక్కలు మొరిగినట్లు, ధర్మం ఎంత నిర్భయంగా చాటినా మీ దృష్టిలో నోరు పారేసుకోవడమే—మీరుజేసే కార్యాలుమాత్రం ఆపకండి!

వెం: (వస్తున్న కోపాన్ని అపుకొని వినయంగా) కూర్చో ఎందుకలా ఉద్రేకపడ్తావ్?

సు: చేతులెత్తి దణ్ణంపెడ్తా, (రెండు చేతులెత్తి దణ్ణంపెట్టి) యికమీదటైనా మీ పగకు మా ప్రాణాల్ని బలిజేయకండి, మా బతుకు మమ్మల్ని బతకనివ్వండి—

వెం: (అతివినయంగా) ఏఁవిటో వికటంగా మాట్లాడడం నాకర్థంఅయి యేడిస్తేగా?

గు: చెప్పేదేదో నెమ్మదిగా చెప్పరాదంటయ్యా?

సు: హుఁ......వాతావరణాన్నిబట్టి వేషాలుమార్చి, రంగులేసుకొని సాపలుజుట్టె వాడివి, నెమ్మతి, నక్కజిత్తులు, ఎక్కడ పనిజేస్తాయో నీకు తెలుసు—నువ్వు చెప్పినంత నెమ్మది నాకేం తెలుసు?

గు: (కోపంగా) మునిగో ముణ్యాలెత్తో—ఏంటయ్యా నీ మాటలూ, [illegible] వృషభ[illegible] బుజాన

వెం: (సుబ్బారెడ్డి నుద్దేశించి) మాటల్లో విలువుండాలి. అర్థం లేని ప్రసంగంతో ఏం లాభం యింతకూ నువ్వొచ్చిన కారణం?

సు: (ఉద్రేకంగా) మీరు మాబోటి పేదలపైన సాగించే క్రోధాలు, దౌర్జన్యాలు, దయదలచి చాలించుకోవలె నని, ప్రార్థించుకోవటానికొచ్చా. అదే కారణం నేను రావడానికి, యీ ఒక్క విషయాన్నే మీదగ్గర నేను కోరే భిక్ష!

వెం: హ్హా, హ్హా, హ్హా, హ్హా—ఉపన్యాస వేదికనుకొన్నావా లెక్చర్ దంచేస్తున్నావ్?

గ: కాపురం జేసే యిల్లని మరిచాడు పాపం!

వెం: (హేళనగా) చూ స్తుంటే—అలాగే ఉంది ధోరణి—

సు: న్యాయాన్ని నిర్భయంగా వెల్లడిస్తే, ఉపన్యాసం, వింత, వింత ధోరణి కావొచ్చు—కానీ దైవస్వరూపమైన ధర్మం, లక్షలమంది ప్రజలకూ ఒకటే తీర్పు చెబుతుంది. మనుష్యులన్న విలువ మరచి ప్రవర్తిస్తున్న మీకు, యీ మేడలో ఒకటే న్యాయసమ్మతమైన నీతి బోధిస్తుంది!

వెం: (కోపంతో ఉగ్రుడై సోఫాలోనుండి లేచి లేని వినయం తెచ్చుకొని) చూడు సుబ్బయ్యా! అసలు విషయం ఏమిటి ఎందుకింత తొందరపాటు?

సు: మా జీవితం, యెప్పుడూ తొందరపాటే లేండి! లేనిపోని ప్రేమ తెచ్చుకొని అతివినయంగా మాట్లాడడం మా చేతగాదు. మా కడుపులో ఉన్న విశాలమైన మాటలు దుడుగ్గానే వస్తాయి—

వెం: (కోపంగా) యింతకూ అసలు విషయం, ఏఁటయ్యా?

గు: (హేళనగా) అసలు విషయం, వాచా ప్రభావం చూపించడం!

సు: (గున్నయ్య నుద్దేశించి) నా మాటల్లో, నీతి, న్యాయం, ప్రేమ, ఉండాయని తెలుసుకో. కానీ నీ నటనతో గూడిన సాడీలమాటలు, విషంతో నిండుండాయో లేవో, నీకు నువ్వే గుండెమీద నిర్భయంగా చెయ్యివేసుకొని తెలుసుకో—

గు: పెద్దవాడివి ఎందుకయ్యా నోరు పారేసుకొంటావ్?

వెం: యిదుగో సుబ్బారెడ్డే—మాట్లాడడం నీకేగాదు అందరికీ చాతవు!

సు: అన్యాయాన్ని, నిరంకుశత్వాన్నేనా?

వెం: నీ నోటికి, మేఁమెంత లోకువైతేమాత్రం, నీ విచ్చలవిడి మాట్లకు హద్దుండక్కర్లే?

సు: (ఆవేశంగా) మీ బతుకుమీద మీరెంత ప్రేమా, భయం తీపి జూపిస్తుంటారో!—అలాగే ఎదుటి జీవితాలపైన మీతో సమానమైన ప్రేమ–గౌరవం జూపించినప్పుడు నా ఉద్దేశాలు మీ కర్థమౌతాయి!

వెం: తాను దూరను సందులేకపోయినా మెడకొక డోలని - వచ్చినట్టేపోక, మాకూ తెలుసులే, అహింసా సిద్ధాంతాలు నువ్వు బోధజెయ్యక్క-ర్లే.

గు: అహింసా మూర్తుల్ని మరిపిస్తున్నాడులేండి!

సు: (గున్నయ్య నుద్దేశించి) నీచుడా—

గు: (ఉగ్రుడై) జాగ్రత్తగా రానివయ్యా కూతలు—ఆఁ—

సు: అహింసావేత్తను నే నౌతానా? (గాంధీ ఫోటోవైపు చెయ్యిజూపి) అలాంటి మహా పురుషుల రూపాలను, మేడల్లో పెట్టుకొని, పుష్పాలతో పూజించి లోకాన్ని మెప్పిస్తున్న మీరు సిద్ధాంతాలేగాదు వేదాంతాలను గూడా వల్లించగలరని నాకూ తెలుసు. బైటికి అహింసా తత్వాలు—లోలోపల చేయించే ఘోరాలు పట్టపగలు కత్తులిచ్చి, కూనీలు జేయమని పంపించడం గూడా, యిప్పుడే కనుకొన్నా. సిద్ధాంతాలు తెలీకేం, అందరూ చిన్ననాడు చెప్పగా విన్నవే, ప్రస్తుతం వింటున్నవే!

వెం: (ఆందోళనగా) పెద్దవాడవని యింత గౌరవిస్తున్నా, మర్యాదలేదేం! ఎవరిచేతికి కత్తులిచ్చి, ఎందర్ని కూనీ జేయించావని, నీ మాటలు -

గు: (బిత్తరగా) ఐనా-మాటలకు హద్దూ పద్దూ ఉండక్క-ర్లే!

సు: ఏం తెలీనట్లు నటిస్తున్నారే, ఏవేషంతోనైనా యీ గుడ్డిలోకాన్ని మెప్పించడం, మీబోటి మా రాజులకే

తెలుసు. మీ క్రింద (గున్నయ్య నుద్దేశించి) గులాం పన్లుజేసే యీలాంటోళ్ళకి యింకా బాగా తెలుసు!

గు: యిక నా నోరు మంచిదిగాదు ఆ సంగతీ తెలుసుకో?

వెం: (సుబ్బారెడ్డి నుద్దేశించి) నువ్వెక్కడ మాట్లాడుతున్నావో తెలుసా?

గు: గ్రామ సావిడనుకొన్నాడు పాపం!

సు: ఆఁ.... తెలీకేం, పేదలు కష్టించి ప్రతిరాతికీ ఒక్కొక్క చమటబిందువు రాల్చి నిర్మించిన మీ భవనంలో, మీతోనే మాట్లాడుతున్నానని అనుకొంటున్నా!

వెం: పేదలూ, పేదలూ! యెవరా పేదలు? మనుష్యులుగాదూ? భవనాలు, మేడలు, మనుష్యులు కట్టక జంతువులు కడ్తాయా?

సు: యీ సిరిసంపదంతా పేదలు సంపాదిస్తున్నదేనని యింత వరకూ జ్ఞాపకమున్నందుకు, నేను మీకు కృతజ్ఞుణ్ణి. అలాంటి పేదలమీద మీరు ప్రవర్తించే నడవడిక, ఒక్కసారి మీలో మీరే తలపోసుకొంటారని కోరుతున్నా -

వెం: వళ్ళు తెలీకుండా ప్రవర్తిస్తున్న నీబోటివాడి సామి ద్రోహాన్ని గూడా అర్థంజేసుకొని తలపోసుకొన్నా తెలుసా?

గు: ఆ - హ్హాఁ అమ్మ పుట్టిక మేనమామలకేగా తెలిసేది!

సు: నేను మీకెంత ద్రోహం జేస్తున్నది లోకానికే తెలుసు. తానెవరో మరిచిపోయి మీమాటలే అభినయిస్తున్న

(గున్నయ్య నుద్దేశించి) యీ పెద్దమనిషికే తెలుసు -
నా మంచీ చెడ్డ!

వెం: యింకా ఏం జెయ్యాలి - ఒక్కగా నొక్కడు వాడికి లేనిపోనివన్నీ నేర్పుతూ కుట్రలుపన్నుతున్నావ్! నీ వ్యవహారాలు నే నున్నంతకాలం సాగ వేరవని తెలుసుకో!

సు: (ఆశ్చర్యంగా) మీ అబ్బాయికి లేనిపోనివి నేర్పి మీమీద కుట్రపన్నుతున్నానా?

వెం: లేదేం ?_హుఁ _ నీయంతసు విషయం ఆలోచించుకొనే నాతో బంధుత్వం జేయడానికి సన్నాహాలు జరుపుతున్నావా?

గు: ఐనా .... భూమికీ, స్వర్గానికి నిచ్చెన్లేయడం, యంత సాహసం -

సు: మీ అంతస్థులు యంత గొప్పవైనా, మనస్సులేదు. మాకు మనస్సు ప్రధానం!

వెం: (ఆగ్రహుడై) ఆఁ.. పేగులు నడుపుకోడానికి గంజికి దోవలేదు కూతుర్ని కట్టబెట్టి, నా ఆస్తంతా మింగాలని పన్నాగం! ఎంత సాహసం -

సు: మానవత్వమున్న మనిషి, గంజికి కూడా అర్హుకాడడం, ప్రపంచంలో పరిపాటేగా!

వెం: (బెంచి గుద్ది) చేసే తప్పును సమర్థించుకోడానికి, వేదాంతం అనవసరం. జవాబు సూటిగా చెప్పు!

సు: (నిర్భయంగా) ఆస్తులు లేనంతమాత్రాన, మేం మనుష్యులం కాద నేనా మీ ఉద్దేశం? భూములూ, ధనం,

ఉన్నవాళ్ళైనా మీతో వియ్యాలిక్కర్లు, మీరు మా బోటి పేదవాళ్ళను సంఘంలోనుండి, బహిష్కరించ వలెననేనా మీ కోర్కె, యిదేనా న్యాయం? ఇంతేనా యీ లోకం?

గు: నాలుగు డబ్బులు సంపాదించుకోడానికి, యిదీ ఒక ఎత్తే!

సు: నీబోటి ఎంగిటికూటి కాసపడే వ్యక్తులు నాలుగు డబ్బుల కొరకు ఎంత నీచమైన పనికైనా తయారు—కానీ మేం, బీదతనంతో కుళ్ళిపోతున్నా దయా, ధర్మం, పాటిస్తాం, వాటికొరకు ప్రాణాలైనా వదుల్తాం, తెలుసా?

వెం: గొత్తికు బెత్తెకు లోకని తెలుసుకో, నీ యంతస్తుమించి ప్రవర్తించడం ప్రమాదకరం —

సు: ప్రమాదకరమని తెలుసుకొనే, మీ శ్రేయస్సుకోరి వినయంగా తెలపడానికొచ్చా!

గు: ఆ—హ్హా, హ్హా — కందకు లేని దురద కత్తిపీట కొచ్చినట్లుంది— ఏందయు, ఏందయు!

వెం: మా శ్రేయస్సు నువ్వు కోరనవసరంలేదు తెలుసుకో!

సు: మీరుగూడా పరిస్థితుల్ను అర్థం జేసుకొని ప్రవర్తించడం, నేర్చుకొండి, మీరుజేసే కార్యాలు ప్రజలకు తెలీకుండా పోలేదు!

వెం: (కోపంగా) వళ్ళు తెలుసుకొనే మాట్లాడుతున్నావా?

సు: వళ్ళుతెలియని మీకు తెలియజెప్పడానికే వచ్చా!

వెం: (బల్ల గుద్ది) ఆఁ........

గు: (హేళనగా) సాక్షాత్ బుద్ధభగవానుడు, జ్ఞానోదయ బోధ.

సు: (గున్నయ్య నుద్దేశించి) ఎవర్ని జ్ఞానోదయబోధో ప్రజలే బుద్ధిజెప్తారు నీకు యిక. గండండ్ని, పుల్లడ్ని, తాగించి కూనీ చెయ్యమని పంపిన, నీ నీతిమాలిన జ్ఞానానికి అర్థం, తప్పకుండా ప్రజలే చెప్పగలరు—తప్పదు!

గు: (ఆందోళనగా) ఆఁ-ఆఁ-ఆఁ-నేనా, కూనీ చెయ్యటానికి పంపానా?

సు: ప్రపంచాన్ని ఆడించేశక్తి మీకేఉంది. మీ స్వార్థంతో మీ ధనమదాంధంతో మనుష్యుల్ని బొమ్మలుగా జేసి, మీ చేతనైనట్టు ఉపయోగపెట్టుకోగలరు. పేదలను నాశనం జేయడానికే మీ శక్తి, నుపయోగ పెట్టగలరు. మీ నిరంకుశపాలనకు లాభం. ఈ చలువ రాతి భవనాల్లో నీతీ, నీమాలు విడిచి న్యాయాన్ని దిగనాడి శాంతిశోభగా, ప్రేయసీ ఋణుల్తో...

వెం: (బెంచి గుద్ది పైకురికి) నోర్ముయ్ ముసలిముండా కొడకా!

సు: నా వక్కడినోరు మూయించగలవు – నీ క్రూరానికి నన్నొక్కణ్ణి బలిగా మార్చుకొని, నీ పగ తీర్చుకో గలవు. కానీ, ప్రపంచాన్ని, ప్రజల్ని ఆపలేవు. ఏనాడైనా, నీ హింసక హంతక చర్యలకు ఆఖరురోజు సమీపిస్తుంది.......

వెం: (చెయ్యెత్తి కొట్టబోయి) ఆఁ....

సు: నాకేగాదు ముసలితనం నీకూ ఉందని తెలుసుకో! పది మంది బతికే సంపదను నీ వక్కడివే మేసుకొని బలికే రోజులు నశిస్తాయి తెలుసుకో! అమానుషత్వంగా ప్రజల్ని బాధించే, నీ నియంతృత్వానికి చావుందని ఆలోచించుకో....

గు: (గుండెలు కొట్టుకొని) ఎంత ధైర్యం వుంటేమాత్రం. యింత నిర్భయంగా నోరు పారేసుకోకయ్యా!

సు: పేదవాళ్ళం, ఎంత నిర్భయంగానైనా న్యాయాన్ని అడుగుతాం. మా ప్రాణాలు ధారపోసైనా, అన్యాయాన్ని పాతిపెడ్తాం. అదే మా ఆశయం, అదే మా విధి – కానీ నీచమైన ఎంగిటికూటి కాసపడి, యిలాగు మానవత్వాన్ని చంపుకోలేం!

వెం: మింగను మెతుకు లేకపొయ్యినా మూతికి సంపంగె నూనని – మానవత్వంట మానవత్వం!

సు: ఔను – గంజికి కరువై, కడకు నిలవ నీడలేక జీవచ్ఛవాలమై, కుములుతున్న మాకు మానవత్వమే సౌందర్యం. కానీ మనుష్యులన్నమాట మరచి, పేదలనే వర్గభేదంతో హింసతో మారణాలు జరుపు స్వార్థపిశాచులు మీరు. మీ కౌటిల్యానికి, ఈర్ష్యకు, మీ దానవకఠోర పాలనకు, ఎంతమంది పేదసంసారాలు కూలిపోతున్నాయో, తెలుసుకోండి. భోగ భాగ్యాలతో భవనాల్లో సుఖసంపదల్తో, (రెడ్డివైపు చెయ్యి జూపి) యీ జరీపంచెలు, యీ సిల్కుచొక్కాలు,

యీ అష్టయిశ్వర్యాలు అనుభవించినంతమాత్రాన, మనుష్యులనిపించుకోరు. మనుష్య రూపంలో ఉన్న రాక్షసులు మీరు - అంతే. మానవత్వానికి మీకు సహస్రకోట్ల యోజనాల దూరం!

వెం: (ఉగ్రుడై పైకిలేచి) దౌర్భాగ్యుడా! ముందు నాగుమ్మం దాటుపో-యిక దాటు.

సు: దహించేసే ఆకలితో, వేదనతో, కూలిపొయ్యే పేద వాళ్ళను, యీ భవనాలు మేడలు రక్షించవు-పోతా, ఒక్క-మాట జ్ఞాపకముంచుకోండి! మీ నిరంకుశ దుశ్శా సన పరిపాలన, ప్రజాహృదయాన్ని ఉండుంగూడా కలతబెట్టజాలదు. అలాంటి ప్రవర్తన మీ వినాశనా నికే దారిజూపుతాయి. యికమీదనైనా తెలుసుకోండి.

గు: (హేళనగా) భవనాలూ - మే - డ - లూ నువ్వో ఒక భవనం కట్టించగూడదూ?

సు: భవనాలల్లో, మేడల్లో, యీ ప్రకృతి సిరిసంపదల్లో, సమానత్వ శాంతిరూపం చరిత్ర రూపొందించు కొన్న నాడు నీబోటి కక్కిన కూటికి ఆశపడే వ్యక్తులకు మా దగ్గర తావుండదు తెలుసా?

వెం: (వికటంగా నవ్వి) సమానత్వం, సచ్చినప్పుడు స్మశా నంలో___

సు: ఔను...ఆనాడే మీరు, మేము సమానం. అని గొంతెత్తి పాడే ధర్మ స్వరూపిణి, మృత్యుదేవత సాక్షాత్కా రంగా తీర్పు చెబుతుంది, భోగాలతో, కర్కశంగా

ప్రవర్తించే మీకు. స్వార్థంతో ప్రజలరక్తం ద్రాక్షా రసంలా సేవిస్తున్న మీకు, నిరంకుశత్వంతో తృప్తి పడుతున్న మీకు, పేదల జీవితాలను మీ ఐశ్వర్యాల కొరకు ఎరవేసుకొంటున్న మీకు యేలాంటి శిక్ష విధిస్తుందో తెలీదు.

వెం: (పైకురికి) చాలించు యిక నోరెత్తేవంటే ఏమయిపోతావో తెలుసుకో?

సు: దారిలేని, దిక్కులేని, నిరుపేదలు ఆకలి దప్పికతో అణగారి పోయే నిర్భాగ్యులు. మీ సుఖాల కొరకు, మీ భోగాల కొరకు, కండలు కరగంగా, రక్తం యింకంగా ఎముకలరగంగా కాయికష్టం జేసే పేదలేమౌతున్నారు? మీ చెప్పుక్రింద పూరైె నలుగుతున్నారు, అందులో నేనొకణ్ణని నాకూ బాగా తెలుసు.

వెం: నోర్ముయ్, దొంగముండాకొడకా!

సు: ఔను. నేను దొంగను, మీరు దొరబురకా వేసుకున్న పచ్చి...పచ్చి కూనీకోర్లు. స్వార్థంతో దోపిడీ దొరతనం సాగించి ప్రజల మాంస రక్తాలను సేవించే ధన స్వామ్యపు రాబందులు, విషపుచర్యలతో పగబట్టి పేదలను హతమార్చే దుర్మార్గపు నాగుపాములు. మీబ్యాంకుల్లో డబ్బు, మీ మేడల సొంపు, రోల్సు రాయి కార్లు షోకు మీ యిష్టప్రేయసీల కొరకు ఆడంబర వ్యయం. మీఅహంకారానికి నిదర్శనాలు. యిదే

ప్రపంచంలో, యెవరు దొంగని ప్రజలే మన విలువను ఒక నాటికి గుర్తించకపోరు—

వెం: (సమీపించి చంపమీద కొట్టేస్తాడు) గాడిదకొడకా!

సు: హుఁ... ....మీది ధనికవర్గం, కొవ్వెక్కిన ప్రతాపం. యెంతటి నిరవధికానికైనా, నిరంకుశానికైనా, వెనుదీయని నీచులు మీరు. కానీ మేం పేదవాళ్ళం మా జీవితమే అంధకారం, మా జీవితం క్షణక్షణానికి హడలు గొట్టించే దరిద్రపు హీనం. నరకమైన బతుకు అనుభవిస్తున్న జీవచ్ఛవాలం. మనుష్యుల్ని కడకు హత్యజేసి సమర్థించుకోగల శక్తి మీకే ఉంది కాని వ్వండి! ఆఁ—

వెం: ద్రోహుడా! నావాణ్ణి నాకు దూరంజేశావ్? నిన్ను ఏం జేస్తానో చూడు నిన్ను ప్రాణం తీసేటంతవరకూ నా మనస్సుకు శాంతి దొరకదు.

గు: (సుబ్బారెడ్డి నుద్దేశించి) యిప్పటికైనా రెడ్డిగార్ని క్షమాపణ కోరుకో, సుబ్బయ్యా!

సు: ఛా....పిరికిపందా, అన్యాయాన్ని ఎదిరించలేని నువ్వు నాకు నీతులు జెప్తావా?—థుకాక్!

వెం: పెద్ద మాగ్నుజంతో బైల్దేరాడు! నాయ్యం, న్యాయం అంటూ దరిద్రపెదవ!

సు: దరిద్రులమే—చలికి ఎండకూ చివికిన చరిత మాది. ధర్మం లేని యీ నరరాక్షస లోకంలో, అశాంతితో రగులు

ఆకటిమంటలు మండుకొనెడి దారిలేని నిర్భాగ్యులం. మీలాంటి ధనస్వామ్యపు హంతకచర్యలు హంత మార్చేటంతవరకు, మాకీ బానిసత్వం తప్పదు.

గు: ఉపోద్ఘాతం యేమిటి. బానిసత్వం, బీదతనం ప్రపంచంమీద లేకుండా చేయడమే! (హేళనగా నవ్వి) ఎందుకో పెద్దలుచెప్పిన సామెత జ్ఞాపకానికొస్తుంది.

సు: ఫాక్టరీ పనిజేసేవాడి శోభనుగురించి పెద్దలు సామెత జ్ఞాపకానికొచ్చిందా? చీకట్లలో సొరంగాలలో హృదయం జలదరించు రంగు నీటితుంపరలతో జారి పోవు బండలు తొలిచి, సాధించి తెచ్చే సిరిసంపదలు పేదల కష్టమని, ఆ పెద్దలు చెప్పిన మాటలు జ్ఞాపకాని కొచ్చాయా? గుండెలు పగలకొట్టుకొని కష్టిస్తున్న రైతు సుఖాన్ని గూడా నిరాశపాలైపోతుందని, ఆ పెద్దల అమృతవాక్యాలు జ్ఞాపకాని కొచ్చాయా? అలాంటి చాకిరి జీవుల్ని హతమార్చడమేనా—యిక నింతేనా? మీ కుతంత్రాలు, పన్నాగాలు!

గు: ఎవరు జేసుకొన్న పుణ్యం వాళ్ళదే. కష్టపడేవాళ్ళే లేకుంటే లోకం ఎలా జరుగుతుంది?—ఎందుకయ్యా నీకు లేనిపోని యాతన? గుట్టుగా కాలం గడుపుకో కుండా.

సు: ఆ గుడ్డివేదాంతం మాకూ తెలుసు, సిగ్గు లేకపోతేసరి - ఎన్ని పేదసంసారాలు బ్రతుకు చెరకు స్మశానవాటికలా ఐపోయాయో ఆలోచించావా? యీ కటిక రాక్షస

పాలనలో, మానాభి మానాలకు తెలవంచే విశాల హృదయులు, నీరసం, నిస్పృహా కబళించి మృత్యు గహ్వరంలో ప్రవేశిస్తున్నారో ఒక్కసారి ప్రపంచాన్ని పారజూడు. కానీ నీమట్టుకు నువ్వు ధనవంతులకాళ్ళ కింద గులాంలాగు అడుగులకు మడుగులొత్తుతూ కాలం గడుపుకొన్నంత మాత్రాన యేదో గొప్పశక్తి నీలో ఉందని ఊహించుకోకు జ్ఞాపకముంచుకో!—

గు: చాలించవయ్యా! చాలించు, ఓ—యబ్బా మహా గొప్పగా నీతి బోధిస్తున్నావ్. నువ్వు మాత్రం మారాజుల సేవ జెయ్యడంలే. కూతుర్నిచ్చి పెళ్ళి జేసి. ఆమాంతంగా యీ మేడలో హక్కు సంపాదించాలని నువ్వు పన్ని పన్నాగం స్వార్థంగాదూ? పైకి డంబం కొట్టుకొన్నంతటిలో ప్రపంచం నమ్ముద్దూ?—

సు: యీ మేడలో హక్కు నాకెందుకు? నీ కాల్సివాలి, పశువు కన్నా హీనమైన స్థితిలో ఉన్న నీకు కడుపు నింపుకోవడానికి ఎంగిలి స్వార్థం కావాలి కానీ, మా ఉద్దేశాలు మా ఊహలు ప్రజాశ్రేయస్సు కోర్తాయి, నిస్వార్థాన్ని అపేక్షిస్తాయి. తరతరాలుగా పెరిగొస్తున్న దాస్యాన్ని త్రుంచి తెంచి తరుణజీవుల బాధలు అంతమొందిస్తాయి. బీదలకు, భాగ్యులకు మధ్యనున్న ఉక్కు తెరను పటాపంచలు జేస్తాయి. రామరాజ్యపు వెలుగు శాంతిని ప్రసరింపజేస్తాయి, తెలుసా? నీబోటి నీచులు

నా విషయంలో ఎంతటి అపార్థం జేసుకొని ప్రవర్తించినా, దైవాన్ని మెప్పించలేరు—

వెం: (విసుగ్గా) మెడబట్టి బైటికిగెంటేంతవరకూ నువ్వింతే, ముందికళ్ళోంచి దాటి నీ యిష్టంవచ్చినట్టు కూసుకోపో! ఆఁ —

సు: (రంగం వీడిపోతూ) అంత శ్రమ మీకెందుకు లేండి, నేనే పోతున్నా. ఒక్క విషయం జ్ఞాపకముంచుకోండి! అంతే చాలు. నువ్వు గ్రామంలో సాగించే బందిపోటు చర్యలు, దేవుడి భూమి అపహరించాలని చేసే కుట్రలు, నిరంకుశ పిశాచకృత్యాలు అవగింజంతైనా నెరవేరవని తెలుసుకో—— అంతే.

వెం: (సోఫాలో కూర్చుని తలమీద చెయ్యేసుకొని) అబ్బా-పోయ్యింది పీడ తల బట్టగట్టింది. యిదంతా నా కర్మ ఫలమే కానీ ఏం జేదాం——

గు: (కుర్చీలో కూర్చుని పొడి పీలుస్తూ) వీడి మిడసరప్పాటు ఎంతకాలంలేండి అదీ తేలిపోనూ!

వెం: ఆ దరిద్రుడు జెప్పినట్టు నేను జేసే పన్లన్నీ నాకే సుట్టుకొంటున్నాయ్!

గు: యింతకూ, ఆ తాగుబోతు ముండాకొడుకులు చేసిన అన్యాక్రమే-వీడు ప్రాణంతో మన కళ్ళముందుకొచ్చి యింత రాద్ధాంతం జెయ్యడం. లేకుంటే యీపాటికి —

వెం: (విసుగ్గా) ఆఁ...తల తిరిగిపోతూఉంది కొంచం విశ్రాంతి తీసుకోనివ్వండీ!

గు: (నిష్ఠూరంగా) యింతకూ మీ మనస్సు చీకాకుపడేటట్లు జేసింది నేనేగా! ఆ దరిద్రులు వాడితల ఒక్కసారి తెగ నరకలేని చేతగానితనమే, నామాట నెగ్గించుకోలేక పోవడం! మీ మనస్సు కష్టపడ్తూ ఉండడం!

వెం: (భారంగా) ఏంటివే? పిచ్చిగా తలపోసుకొంటున్నావే? యింతకూ నువ్వేం జేశావయ్యా, యిలా జరగద్దని ఎవరు సూశొచ్చారు? యిప్పటికీ మన చెయ్యి మించి పొయ్యేదేదీ లేదుగా!

గు: ఐనా...ఆ గండడూ, పుల్లడూ సామాన్యులా? ఎందు చేతనో పాపం, వాళ్ళు చిక్కినపడ్డారు. యింతకూ మనవిషయం బట్టబైలు జెయ్యరుగదా— చాదస్తులు.

వెం: (ఉద్రేకంగా టేబిలుగుద్ది) యిక విషయాలు ఎంత బట్ట బైలైనా నన్నేం జైలేవ్. వాడు యిక ప్రాణంతో బతకడం జరగ్గూడదు. ఏనాటికైనా వాడిప్రాణం నావల్ల అంతం గావాల్సిందే.

గు: (ప్రోత్సాహంగా) అంతపనీ, యీవరకే ఐపొయ్యేదే— యింతకూ వాడి ఆయుస్సు గట్టిది.

వెం: పుండాకోర్, నోటికొచ్చిన కూతలన్నీ కూశాడు. ఎంత ధీమాగా ప్రవర్తించాడు!—హుం.

గు: దరిద్రపు ముండాకొడుకు తృళ్ళిపాటు ప్రవర్తనకు ఫలితం అనుభవిస్తాడుగా!

వెం: దొంగరాస్కెల్ - విశ్వాస ఘాతకుడు - యిన్నాళ్ళు,

అప్పుసప్పు యిచ్చి కాపాడిన కృతజ్ఞతగూడా తెలప లేకపోయ్యాడు.

గు: రారాజుల ప్రేమ నీచుల సబ్బురా — అనే సామెత ఊరక కన్నారా? తిన్నయిల్లు గుద్దలిచే వాళ్ళకేగా!

వెం: యివ్వాల్సిన, అప్పుకు యిల్లు జప్తీకి తెచ్చి, వేలం వేయిస్తా. తర్వాత వీడి ప్రతాపం. నన్నేం జేస్తుందో చూదాం!

గు: భోరున యేడ్వాల్సిందే. వాడి పంచప్రాణాలు మన చేతుల్లో ఉన్నప్పుడు వాడి ముండపెగ్గెలు, యేంపని జేస్తాయండీ?

వెం: ఐనా .... ఏం అహంకారం. అలాంటి దుర్మార్గపు కూతలు నేనిప్పటికి ఎన్నోటా....

గు: ఆఁ.... కుక్క కూతలు కూస్తే సరిపోయ్యాయా, వాడికే ఆ మాటలు చేటుతేండీ!

వెం: (టేబిలుగుద్ది) వాడి సంసారాన్ని ముక్కలు చెక్కలు జేయిస్తా నా పగ తీర్చుకొంటా—.

గు: 'వినాశకాలే విపరీతబుద్ధే' అన్నట్లు వాడికి మృత్యువు దగ్గరకొచ్చేగా మీ పగకు గురికావడం!

వెం: యిన్నాళ్లు లోకానికి భయపడ్డా, యిక జూస్తారుగా, యీ వెంకట్రామిరెడ్డంటే ఎంతటోడో అన్నవిషయం.

గు: వియ్యమైనా, కయ్యమైనా సరిసమానుల్తోనే, యోగ్య మన్నారు. అట్లాగాకుండా చిల్లిగవ్వలేని ముండా

కొడుకు మీతోనే అన్ని విషయాల్లో వస్తే, మీ దృష్టిలో వాడెంతండీ?–

(జబ్బుతో దగ్గుతూ కఱ్ఱబోటుతో ప్రవేశం నారయ్య)

వెం: (షాక్) ఏం నారయ్యా? వంట్లో బాగులేదట్నే?

గు: (హేళనగా) ఆం... కాయో, గడుసో కాస్త జాస్తిగా పడేసుంటాడు కడుపుకు.

నా: (దుఃఖంతో కుంగిపోతూ) కాయో గడుసో గాక మీలాగు మాకు పంచభక్ష పరమాన్నాలెలా వస్తా యయ్యా?–

గు: రాకేం? ఉన్న యిల్లు దోచుకొంటూఉంటే, మృష్టాన్న భోజనాలకు కొరవలేదుగా?

నా: (వెఱ్ఱిగా నవ్వి) ఔను ఉన్నవాళ్లను దోచుకొని అనుభ విస్తున్న మా బ్రతుకు యీలాగే ఉంది!

వెం: (బలవంతంగా నవ్వి) మీయిద్దరికీ, యెప్పుడూ ఉప్పులో నిప్పేగా – ఏం నారయ్యా! అసలు విషయం తెలుసు కొన్నావా?

నా: (రోషాన్ని ఆపుకొంటూ) తెలీకేం, తెలుసుకొనే వచ్చా.

గు: ఐతే దొంగసొమ్ము తెచ్చావన్నమాట.

వెం: (గున్నయ్య నుద్దేశించినటునగా) నారయ్యకు మాయింటి మీదున్న విశ్వాసం, యిప్పటికైనా తెలుసుకొన్నా నటయ్యా?

గు: (విచిత్రంగా) ఏనా! నారయ్యా, యింత నిజాయితీ వున్న మనిషి కల్లో గూడా అనుకోలేదండీ నేనూ!

వెం: నేనంటే నువ్వు నమ్మావా, యిప్పటికైనా సత్యం కనుగొన్నావుగా—

గు: (అభిమానంగా) నారయ్య మాటల్లో కొద్దిగా పెడసరైనా, పరిశుభ్రమైన మనస్సుగలవాడండీ!

వెం: (ఉత్సాహంగా) లేకుంటే యిన్నాళ్లనుండీ నా కెట్లా, గిట్టగలిగాడంటావ్.

నా: (అర్థంగాని అందోళనగా) ఏంటండయ్యా? మీ పన్నాగం?

గు: ఆఁ....పన్నాగవాఁ—కూతురు రెడ్డిగారి బీరువాలో చిల్లర కర్చులకని పెట్టుకొన్న ఐదొందలు దొంగలించుకపోయిన విషయం, పన్నాగవాఁ?

నా: (షాక్) ఆఁ...నా కూతురుపైన దొంగతనం గట్టారా?

వెం: (దీమాతో) ఔను, దొంగపని జేసింది కాబట్టే అనుకొంటున్నాం, నీకింకా తెలిసేం. కర్మ—

గు: ఏనా రెడ్డిగారికి— నీమీదున్న నమ్మకాన్ని నీ కూతురు చెడిపింది, ఐదొందలు తెగునా తెల్లారునా, నమ్మకాన్ని చడగొట్టుకొంటే యేలాగు!

వెం: (గున్నయ్య నుద్దేశించినటనగా) కూతురు జేసిన దొంగతనాన్ని నారయ్య కంటగడితే యేలాగు 'పులికడుపున మేక బుట్టిందని' నామెతుందిగా.

గు: అంతేగదూ, మరి!

నా: (దుఃఖంతో ఉద్రేకంతో వణికిపోతూ) ఎందుకండయ్యా? పేదల్ను పసిబట్టి గోడుపెడతారూ!

గు: పిచ్చోడా! నిన్ను గోడుపెట్టాలంటే పెద్దపనా? ఒక్క-పోలీసు రిపోర్టిస్తే చాలు - రెడ్డిగారేవో నీమీద దయ దలస్తున్నందుకు యిదానిద్దీ? - ఆఁ-

నా: (ఉద్రేకంగా) హు.... రెడ్డిగారి దయ, నా జీవితమంతా చాకిరిజేసి, నా నెత్తురు ధారబోశా, కడుపు కరువుతో మలమలా మాడిపోతున్న రోజుగూడా, ఎంతో సంతోషంగా మీ రెడ్డి మనస్సు తృప్తిపరిచా, కానీ నాబోటి దౌర్భాగ్యులపట్ల (రెడ్డివైపు చెయ్యిజూపి) యీయనగారు జేసిన దురంతాన్ని కప్పిపుచ్చుకోవడానికి, దొంగతనం కల్పించేశారు మీకు. యిదేనా మీరు నామీద జూపించేసయ- పోలీసు కేసుపెడ్తారా? పెట్టండి, మీయిష్టం వచ్చినట్లు జేసుకుండి మీ కోర్కెలు నెరవేర్చుకోండి-

గు: (ఆశ్చర్యంగా) ఆఁ....దొంగతనాన్ని గల్పించావాఁ?

వెం: అదేనోయ్-నీమీద నూరున్న నమ్మకాన్నిబట్టే పోలీసు కేసుకు సందేహిస్తున్నాం-

గు: (రెడ్డి నుద్దేశించి) మనం దొంగతనం విషయం మాట్లాడుతుంటే - మీ రెడ్డి జేసిన దురంతాన్ని సమర్థించుకోటానికా అంటాడేవిటి, మరి చెడిందా యేంపాడు!

వెం: (జాలిగా) ఆఁ.... పెద్దోడుగదూ, ఏఁవిటో మాట్లాడబోయి లేనిపోనివన్నీ మాట్లాడడం మతిచెడినట్లేగా!

నా: ఔను, తాగి తందనాలాడుతూ, అమాయకురాలు ఆడ పిల్ల వంటరిగా దొరికిందని బలవంతం జెయ్యడం నేను కల్పించిందేనా? నీ, నీతిలేని ప్రవర్తన ప్రపంచానికి గొంతెత్తి చాటేవాళ్ళగూడా మతిచెడిందా? ఎందు కలా నిరంకుశంగా ప్రవర్తిస్తావ్? నీకుమాత్రం, నీ అనే వాళ్లు లేరూ? బిడ్డలులేరూ, మీవాళ్లకే, నా బిడ్డకు జరిగిన అవమానం జరిగితే నీమనస్సు ఎట్లాగుంటుందో ఒక్కసారి ఆలోచించు...

గు: (గుండెలు గుద్దుకొంటూ) ఆс....ఆс...ఏం విపరీతం?

వెం: (టేబిలుగుద్ది కోపంగా) నారయ్యా! పిచ్చిమాటలా? లేక కొవ్వుబట్టిన కూతలా?

గు: (రెడ్డి నుద్దేశించి) 'గోరుచుట్టుమీద రోకటిపోటని' మళ్లా యీ విపరీతమేమిటో!

వెం: పోలీసు కేసుబడితే వాళ్లే అసలు విషయం కనుగొం టారు మనకెందుకొచ్చిన గొడవ-

నా: 'పొంగటం, అంతా, పొయ్యిపాలని' పోలీసు కేసుపెట్టండి, సంకెళ్ళేయించి నన్ను జెయిలు కేయించండి, ప్రభు త్వంలో మీమాట చెల్లించుకోగలరు, మీ పట్టును గెల్పించుకోగలరు. మీ దృష్టి కెదురులేదు, మీ చేతిలో ఆయుధం, నేటి గుడ్డిపాలన. ఆ నిర్జీవమైన ఆయుధంతో మాబోటి పేదల్నంతా తెగనరికి, త్రిశంకస్వర్గం, నిర్మించుకోండి....

వెం: (సోఫాలోనుండి లేస్తాడు వెంటనే గున్నయ్య) ఏయ్....
అదంతా మహా కసవరం. యింతకూ నీకూతురు దొంగిలించుకపోయిన డబ్బూ, నగలు, తెస్తావాలేదా?

గు: (రెడ్డి నుద్దేశించి ఆశ్చర్యంగా) న-గ-లా?

వెం: ఆఁ....(సమర్థిస్తూ) డబ్బూ నగలూ తెస్తే సరి, యీ దఫా క్షమించడం జరుగుతుంది-

గు: (బలవంతంగా) వొనుగరూ. మంచి—అసపిల్ల చెయ్యి జారి ఎధసవచి మొదటినాడు చెయ్యాసి మేగా, మీలాంటోళ్లు ఆమాత్రం దయజూపకుంటే యేలాగులేండి!

నా: (గున్నయ్య నుద్దేశించి, దుఃఖంగా) ద్రోహుడా-

గు: (పై కుదుకుతూ) ఆఁ.... ఏం కూశావ్?

నా: నా బిడ్డజేసిన తప్పుకు మొదటినారి దయజూపమని (రెడ్డి వైపు చెయ్యిజూపి) యీ నీచివంతుణ్ణి, ప్రార్థిస్తున్నావా?—ఛీ, ఎంత సాహస కృత్యానికైనా పూనుకొంటావ్ నువ్వు, నీవొక బ్రతుకేనా, పెళ్ళిగాని పిల్లను అనూచకు గాన్ని నిర్బంధించబొయ్యి, వల్లగాక విఫలమై, ఆఖరుకు పగతీర్చుకోవడానికి దొంగతనం సృష్టించి నెత్తినవేద్దామనుకొన్నారా?....

గు: ఆఁ...నీ కూతుర్ని ఛలవంతం జెయ్యిబోయాడావాఁ?

నా: లేదేఁ—(రెడ్డివైపు చెయ్యిజూపి) యీ మహానుభావుడు తాగి తందనాలాడుతూ జరిపిన ఘోరం, నువ్వు కళ్ళారా సూడకపొయ్యినా నీకు తెలీకుండా బొయ్యిందా? ఎందుకు దొంగనటన జేస్తావ్?...

గు: (రెడ్డి నుద్దేశించి) యీ మాటలన్నీ నిజమేనా?

వెం: (ఆందోళనగా) ఆc...పిచ్చిముండాకొడుకు మాటలు నమ్మేవా ఏంటి, నీ భ్రమ.

నా: ఔను నా మాటలు ఎందుకు నమ్మతారులేండి. నీ ద్రోహపు కార్యాలకు చేదోడువాదోడు లేకుంటే, బతకడం కష్టంగా, నాగతి సంభవించినంతవరకూ ఎవ్వరూ నమ్మరు-

వెం: (నారయ్యను సమీపిస్తూ రౌద్రంగా) ఏంకూశావ్ రా? మల్లా వాగు పళ్ళురాల గొడతానో లేదో-

నా: మీ అంతస్థుకు పళ్ళురాల గొట్టడం మీ గౌరవానికే లోపం, ప్రాణాలే తియ్యండి!

వెం: ఆc..........

నా: (గున్నయ్య నుద్దేశించి) యీనాడు యీ అవమానం నాకు జరిగింది రేపు నీకూ జరుగుతుందని తెలుసుకో, 'పండాకు రాలుతుంటే చిగురాకు నవ్వుతుంటుందని, చిగురాకు నవ్వులపాలు కాగలదని, జ్ఞాపకముంచుకో-

గు: (సబుద్ధితో) ఏంటో యీ గొడవంతా!

వెం: (గున్నయ్య నుద్దేశించి సముద్ధనీయంగా) యిదిగో....వీడికి మతిచెడింది. వీడి మాటలు నమ్మకు. దొంగిలించిన సొమ్ము గుట్టుగా మింగెయ్యాలని యెత్తిన ప్లానిది. మన దగ్గర ఆ పీకలు సాగవని యిన్నాళ్ళనుండీ తెలుసుకో లేదు పాపం!

నా: యిన్నాళ్లు నీసేవజేసి అష్టకష్టాలకు నలుగుతూ నువ్విచ్చిన ఆ పిడికెడు తవ్గింజల కోరకు నీపట్ల విశ్వాసంతో ప్రవర్తించా, నువ్వు జెప్పినట్టు నేను పిచ్చోణ్ణే, దౌర్భాగ్యుణ్ణే, యిందులో సందేహం లేదు. కడకు నా చిన్నబిడ్డ మీదపశుత్వం జూపించిన అవినీతి నీది, యిన్నాళ్ళకైనా యీ పిచ్చోడు, నీబోటి నీచుణ్ణి దూరం జేసుకోవడం, నా పిచ్చుని, మనుష్యులే అర్థంజేసు కొంటారు...

వెం: ఊరక పేలకురా (చేతులో కఱ్ఱ పెరుక్కొని తలమీద కొట్టేస్తాడు)

నా: (బాధతో తలపట్టుకొని) అ—బ్బా. (రక్తం కారి పోతుంటుంది. గున్నయ్య నుద్దేశించి) ఏం ఆపావ్, నువ్వుకూడా కానీ మంత్రిగూడా చెయ్యగలవు.

గు: (జాలిగా) అందుకుగాదు నారయ్యా! ఎందుకీ వాదోప వాదాలని - అంతే—

వెం: గ్రామంలో ప్రతి ఎధవాడూ వాదాల్లో మొన గాళ్ళేగా!

నా: (బాధ భరించలేక తడబడుతూ) క్రౌర్యు జాములులాంటి మీ చర్యలకు, మనుష్యులు పగగాక మంచిగా ఉండ గలరా?—

వెం: (రౌద్రంతో) నీ వాగుడుకు అంతంలేదంట్రా—

నా: బలిసిపొయ్యిన భూస్వామివి నువ్వు, ధనగర్వంతో ఉన్న దయలేని నీచుడవు నువ్వు. నీ పరిపాలనకు మేము

# మూడవ అంకము

[కూలీ సంఘం ఆఫీసు, మధ్యభాగంలో భారతమాత విగ్రహానికి పుష్పాలు అలంకరింపబడి ఉంటాయి. ఆఫీసుకు ముందు స్థంభానికి తగిలించిన క్యాలండరు నాటి తేదీనే చూపుతుంటుంది. విగ్రహానికి, ఇరువైపులా, విశ్వనాధరెడ్డి, సుబ్బారెడ్డి, కాంతమ్మ, గోవిందరెడ్డి, వీరయ్య నిల్చుకొని పాట ప్రారంభిస్తారు తెరలేచును]

అమ్మా! అమ్మా భారతజననీ....!
శాంతికాంతుల విజయ విలాసిని,
భోగభాగ్య సిరిసంపద రూపిణీ.
జయ, జయ, జోహార్ గైకొనవమ్మా!

అసువులుగోలే ఆకటివేదన,
అనంతయాతన నీ హృదయంలో,
కారుచిచ్చుగా లేచిందా!
కరువుబాధయై కాల్చిందా!

ధనికరాక్షసుల పన్నాగంలో
కృంగే పేదల కుమిలేబిడ్డల
అశాంతి జ్వాలల ఆహుతికై
అశ్రుజలధిగా ఏడ్చావా!

మానవదానవ హోమంలోన
విశాల హృదయుల దుర్మరణం
నీ కడుపుశోకమై రగిలిందా!
కటికబాధ యైపోయిందా....!॥

(పాట ఆగుతుంది నినాదాలు) విశ్వం: కూలీసంఘాలకు–

అందరూ: జై!

విశ్వం: రైతుసంఘాలకు—

అందరూ: జై!

గో: ధనవంతుల నిరంకుశత్వం—

అందరూ: నశించాలి!

గో: స్వతంత్ర భారతమాతకు—

అందరూ: శాంతి నెలకొల్పాలి!

విశ్వం: (విగ్రహంవైపు చెయ్యిజూపి) మూడువందలేళ్ళు పరాయిపాలనకు నిలువునా కృంగిపోయిన తల్లి (ఉద్రేకంగా) మన భారతజననిని, దాస్యశృంఖలాలనుండి, తన బిడ్డలు, భారతఖండపు ప్రజలు రక్షించుకొన్నారు. ఆ తల్లి హృదయానికి స్వాతంత్ర్యం కలుగజేశారు. అందుకా కరుణాస్వరూపిణి తన బిడ్డల సాహసానికి తన్మయురాలయింది. తల్లి ప్రేమను సార్థకం జేసుకొన్నారని తన్లో తాను మురిసిపోయింది—కానీ యీనాడు ఆ తల్లికడుపులో అగ్నిజ్వాలలు రేగుతున్నాయ్. భాగ్యవంతులు_పేదలు అనే వర్గభేదాలు ఆ స్వాతంత్ర్య హృదయిని గర్భాన్ని విషతుల్యం జేస్తున్నాయ్. ఆ తల్లి రక్తాన్ని పంచుకొని పుట్టిన మనమంతా ఏకమై శాంతి నెలకొల్పాలి, అమృత తేజస్సును ప్రసరింపజేయాలి—

గో: (ఉద్రేకంగా నినాదం) భారతమాత—

అందరూ: జిందాబాద్!

గో: వర్గభేధం —

అందరూ: నశించాలి.

గో: భూస్వామ్య దౌర్జన్యం!

అందరూ: కూలిపోవాలి.

గో: యీనాడు మన గ్రామంలో జరుగుతున్న అరాచక చర్యలు ఎదుర్కోవాలి.

సు: న్యాయసమ్మతంగా మన కర్తవ్యాన్ని నెరవేర్చుకోవాలి!

విశ్వం: మనమంతా నడుం బిగించి పనిజెయ్యాలి!

కాం: కంకణం కట్టుకొని ముందుకు నడవాలి.

వీ: (ఆవేశంగా) ఏలాంటి పరిస్థితులైనా ఎదుర్కొందాం!

సు: భూస్వామి బలంతో నిరంకుశంగా ప్రవర్తిస్తున్న రౌడీలను హతమారుద్దాం!

విశ్వం: భాగ్యంతో కళ్ళుగానక కడకు కన్నబిడ్డల జీవితాన్ని కూడా బలితీసుకొనే స్వార్థత్వాన్ని రూపుమాపుదాం, మానవత్వాన్ని గూర్చి లోకానికి జ్ఞానం బోధిద్దాం!

[తలనుండి రక్తం కారుతుండగా నారయ్య ప్రవేశమై రంగం మధ్యలో స్పృహతప్పి పడిపోతాడు. అందరూ నిర్భ్రాంతులైపోతారు కాంతమ్మ కంగారుగా కేకేసి]

కాం: నాన్నా (పైనబడుతుంది)

సు: (కూర్చుని నారయ్య తల తొడమీదుంచుకొంటాడు వీరయ్య రంగం వీడను)

విశ్వం: ఎంతపని జరిగింది!

గో: మనం యింకా ఓర్పు వహిస్తుంటే యింకా ఎంత పనైనా....

కాం: (భోరున ఏడుస్తుంది)

సు: ఏం పర్వాలేదులే తల్లి, గాభరాపడకు.

విశ్వం: (నారయ్యను పరీకించి) పెద్దగాయమేఁ తగిలింది.

గో: ప్రాణాపాయం, లేకుంటే సరి—

సు: తలమీద పెద్దగాయం తగిలిందంటే పెద్దవాడు కావడం వల్ల స్పృహతప్పాడు—

[వీరయ్య చెంబుతో నీళ్ళెత్తుకొని తడిగుడ్డతో ప్రవేశం]

వీ: ఎంతదెబ్బ!

సా: (పక్కకు పొర్లి) అమ్మా—

వీ: (నారయ్య తలకు తడిగుడ్డగట్టి ముఖాన నీళ్లు చల్లుతారు) యింతపనీ ఆ రౌడీ ముండాకొడుకులు గండదూ పుల్లదు జేసుంటారు.

కాం: నేను నెత్తిన నోరు పెట్టుకొని కొట్టుకొంటూనే ఉండా. ఆ రెడ్డింటికి పక్కడీనె పోవద్దని....

వీ: ఆఁ – ఆఁ–, నే ననుకొంటూనే ఉండా ఇంతపనీ జరిగింది!

సు: ఇంత గాతకానికి పాల్పడతాడని మునంబొయ్య సూచాచ్చావాఁ?

నా: (కోపంగా) కొన్ని గంటలు ముందుగా ఆయన చేతులో సువ్వనుభవించిన ఘోరం తెలిసీ, 'సూచొచ్చావాఁ'

అన్నంతటితోనే సరిపొయ్యిందా? నాకూ తెలుసు నారయ్యా, మల్లా ప్రాణాల్తో రాడని. యీ మాత్రానికి మనమంతా సంతోషించాలి...

సు: చేతగాని పని జేసిగూడా మల్లా ఆయినే యింతపనీ జేశుంటాడా?—

వీ: ఆ రెడ్డి జేసిన బుద్ధిమాలిన పనికి నీతిచెప్పడానికి పొయ్యాడు గదా? ఆయింటికి పొయ్యి యిట్టా వొచ్చాడు. మరెవ్వరు జేసుంటారూ, యింతపనీ—?

గో: ఆయినగాక మరెవ్వరు జేస్తారు యిట్లాంటి కసాయి పన్లు....

విశ్వం: (ఉద్రేకంతో రెచ్చిపొయ్యి) యీ ఘోరానికి నా తండ్రే కారణం. ఆయిన సముఖంలోనే జరిగుంటుంది యీ అన్యాయం –

సు: (తాపీగా) ఎందుకంత ఆవేశపడ్తారు!

విశ్వం: ఆవేశం, ఆవేశం అంటూ ఉండబట్టే యింతపనీ జరిగింది. ఈ వేళ నిన్ను కూనీ జెయ్యడానికొచ్చిన వెధవలకు తగిన బుద్ధిజెప్తే సరిపొయ్యిండేది....

వీ: (పిడికిలి బిగించి ఉద్రిక్తుడై) ఆ లంజాకొడుకుల రక్తాన్ని తాగేశుండేవాణ్ణి!

కాం: (పైకిలేచి) ఒక్కడే నాడు, ఎన్ని విపరీతాలు జేశాడూ? ఆయినా పేరు కద్దూ అప్రూ లేదు. వళ్ళు తెలీక తాగి గొంతుదాక మైకంతో, నన్ను మానభంగం జెయ్య

బొయ్యి చాతగాక, ఆ క్రోధాన్ని మనస్సులో ఉంచు కొని యీ దురంతాని కొడిగట్టాడు!

విశ్వం: (ఉద్రేకంగా) నాకు తండ్రి కావచ్చు, ఆయన సౌఖ్యం నా మీద ఆధారపడుండొచ్చు. కానీ యీ నాడు నా తండ్రని మీరు గౌరవించి, ఆయన జేసే వికట చర్యలకు తలవంచితే, యిక కుటుంబందు ఏం జేస్తాడో? ఆయన ప్రళయ రాక్షసత్వంతో గ్రామాన్ని నాశనం జెయ్యడానికైనా సంసిద్ధుడే! యికముందైనా కళ్ళు తెరవండి, ముందు నడవండి.

నా: (చిన్నగా పైకిలేస్తూ) యి-శ్శ

గో: (నారయ్యను కౌగిలించుకొని లేవదీస్తూ) జాగ్రత్త.

కాం: (మనో కొట్టుకొని) నెమ్మదిగా నాన్నా!

నా: (విశ్వాన్ని సమీపించి కౌగిలించుకొని) ధర్మమూర్తి, పేదల పాలిటి న్యాయమూర్తి, తండ్రనే పక్షపాతం లేకుండానే, ప్రజల శ్రేయస్సుకొసరం పోరాటం జరిపే దైవ స్వరూపుడు –.

విశ్వం: (దుఃఖంగా) యింతపనీ యెట్లాజరిగింది నారయ్యా?

కాం: నేను నెత్తిన నోరుపెట్టి కొట్టుకొన్నా ఆ రెడ్డింటికొద్దని-

సు: యింత విపరీతం జరగద్దనుకొన్నావాం-?

నా: యిన్నిరోజుల్నుండీ ఆయనసొమ్ము తిన్నాం, ఆయన ఎంత విపరీతం జేసినా, ఆయన ఋణం ఎలా తీర్చుకోగలం?

విశ్వం: (ఆవేశంగా) హుం.... ఋ-ణం-, ఆయిన పట్టుపరుపులు మీద – నువ్వు కటిక నేలమీద, ఆయన మూడంత

స్థల భవనంలో, నువ్వు సూర్య చంద్రాదులు విహరించే తొర్రిగుడిశలో, ఆయన కడుపునిండా మృష్టాన్న భోజనం, నీ కడుపునిండా చెమ్మలేక ఆరి వత్తులైన పేగులు, యిదేనా ఋణం, ఇంతేనా మనిషికి మనిషికి ఉండాల్సిన అనుబంధం. ఔను, యిదే నేటి ప్రపంచం, యింతే యీనాటి చీకటిప్రశాంతం!

నా: (ఆప్యాయం జూపుతూ) ఏందో లెయ్యా! హోదాగల్లా వోడు. కోపంతో రెచ్చిపొయ్యి, చెయ్యిజారి కొట్టాడు.

గో: (ఆదుర్దాగా) ఇంత ద్రోహపుపని ఆయన చేతల్తోనే జేశాడా!

వీ: అన్యాయపుపన్లు జేసేవాళ్ళకి యిదొక లెక్కంటా, గోయిందయ్యా!

విశ్వం: (సుబ్బారెడ్డిని ఉద్దేశించి) నిన్ను నిర్బంధంగా కొట్టాడా? నోరులేని అమాయకపురాల్ని కళ్లు తెలియని కామంతో బలవంతం జెయ్యబొయ్యాడా? అన్యాయమని బుద్ధి జెప్పబొయ్యిన నారయ్యను యీపని జేశాడా, ఇంకా ఊరకుంటే ఏమైనా జేస్తాడు.

నా: యింతకూ ఆ గున్నయ్య కట్రే ఎదురెక్కొస్తుంది—

వీ: (కోపంతో పళ్ళుకొరుకుతూ) ఆ డాఫర్ గాడిదకొడుకు యీసారి కంటబడ్డాడంటే, రక్తం తాగేస్తా.

విశ్వం: (ఆవేశంగా) ప్రపంచంలోకెల్లా అమూల్యమైన వస్తువు మానవ మేధస్సు, అలాంటి దివ్యతేజస్సును కలిగిన

మనం. పశువుల్లా ప్రవర్తిస్తున్న మానవజంతువులకు బుద్ధిజెప్తాం.

కాం: యింతకూ దాచుకొన్న డబ్బిచ్చాడా నాన్నా?

గో: యింత రాద్ధాంతం జరిగినాక, డబ్బుగూడా యివ్వట మేనా?

వీ: చాకిరిజేసి, దాచుకొన్న డబ్బివ్వకుండా బోవడం, ఆయన తాతగాడికి బాకీయ్యా, ఏంటి?

విశ్వం: అన్యాయానికైనా నియమాలులేని మనుష్యులకు ఆ మాత్రం నీతైనా ఉంటుందా?

వీ: (దీమాగా) ఎట్టా యివ్వకుండాబోతాడో చూదాం —

నా: (దుఃఖంతో) నా కష్టంవొచ్చి నెత్తినుంది, ఆయన యింతటితో వొదిల్తేనాలు నన్ను!

కాం: (ధైర్యంగా) వొదలక ప్రాణాలు తీస్తాడా ఏం!

వీ: (ఉద్రేకంగా) మేమంతా గాజులు తొడుక్కోనుండావాం-ఏంటి.

విశ్వం: (రౌద్రంగా) ఆయన దగ్గర నువ్వు చాకిరిజేసి దాచుకొన్న డబ్బు నాకుమాత్రం తెలీకపొయ్యిందా? యీ అన్యాయం జరగడానికి వీల్లేదు!

నా: (కుమిలిపోతూ) అదొక్క అన్యాయవాఁ — ఆయనగారింట్లో (కాంతమ్మ నుద్దేశించి) యీ అమ్మాయి, ఐదొందల రూపాయలు దొంగతనం జేసిందట (మొఖాన చేతులు కప్పుకొని భోరునేడుస్తాడు.)

కాం: (ఆశ్చర్యంతో) ఆఁ...నేను ఐదొందల రూపాయలు దొంగతనం జేశానా ?

గో: ఆయనకేం, మంచి మంత్రమే ఉపయోగించాడు, కట్నం ఋణానికి చేబాకీ జేసుంటాడు.

వీః యీా కీచులాట, ఎత్తు ఆ గున్నడే పన్నుంటాడు....ఆఁ -

కాం: (నిరాశతో) ఆఁ...పోనీలే మా కష్టంతో యింకొక మిద్దికట్టుకొంటాడు?

విశ్వం: హుఁ....మీాబోటివాళ్ళను లక్షలమందిని ముంచబట్టే ఆయన మేడ కట్టుకోగలిగాడు. యిక కోట్లమంది ప్రాణాలుతీసైనా ఎన్ని భవనాలైనా కట్టడానికి జంకడు తెలుసా?

నా: (నిరాశతో) ఆయనిచ్చిన కట్నం డబ్బుతో (కాంతమ్మ నుద్దేశించి) సుఖంగా మా అమ్మి పెళ్ళి కళ్ళజూదాం అనుకొన్నా. కోరికలన్నీ, నిరాశలైపోయాయి!

సు: (నారయ్యను ఓదారుస్తూ) డబ్బు లేనంతమాత్రాన పెళ్ళి ఆగదు లేవయ్యా. విందులు, పల్లకీలూ, లేకపొయ్యినా పెళ్ళే అనిపించుకొంటుందిగాని!

గో: బాండుమేళాల్తో పాటకచ్చేరీల్తో చెవులు 'గ్రు'మని ధ్వనిపుట్టేటట్టు మోటారుకార్ల హడావిడితో, వేలకు వేలు, లక్షలకు లక్షలు కట్నాల్తో మూకూ- మొఖం తెలీని మూగరాళ్ళకు బలవంతంగా పెళ్ళిజేసి, మన తత్వాలను తెలుసుకోకుండా, ప్రేమకూ, మనస్సుకూ,

విలువలేకుండా కేవలం ఆస్తులకొరకు మానవత్వాన్ని పాడుజేసె పెళ్ళిళ్లు మారాజులకే. డబ్బుకు తగిన ఆటో పాలు లేకుంటే వాళ్ళకు చింత, అనమానాలున్నా — కానీ మనకెందుకు? మన బీదపెళ్లిలో ప్రేమ, మనస్సు, హృదయాలను ఏకంజేసే స్వర్గసుఖం, నీతి, నిజాయితీ, మనసొత్తు—

విశ్వం: పేదవాళ్ళుమాత్రం మనుషులుగాదూ? వాళ్ళ కారుల్లో అష్టైశ్వర్యాలు అనుభవించాలని కోరికెందుకుండ కూడదు? అనుభవించడానికెందు కర్హులుగారు? దైవం సృష్టించిన యీ ప్రకృతిలో ప్రతి వ్యక్తికీ సమాన హక్కులున్నాయ్. ఆ హక్కులకొరకే మనం జీవితాంతము వరకూ పోరాడదాం, మన ముందుకాలానికి దారి జూపుదాం.

కాం: (ఉద్రేకంగా) దొంగ బుర్కాలేసుకొని మహాపురుషుల ఆశయాలు వల్లిస్తూ, వెనువెంటనే క్రూరత్వంతో ప్రపంచాన్ని నాశనంజేసే అరాచకాన్ని ఖండిద్దాం—

పీ: ప్రాణాలు పొయ్యేనాసరే అసలు సంగతి కనుక్కోవాల్సిందే ఆః—

సు: మనమంతా ఏకంగా పోరకాడినరోజే విజయాన్ని పొంద గలుగుతాం ఫలితాన్ని అనుభవించగలం.

గో: అప్పుడే యిదే ప్రపంచాన్ని భూలోకస్వర్గం జెయ్యగలం!

విశ్వం: ఆనాడే మానవత్వపు మంచిని చూడగలం, అనంత ప్రశాంతాన్ని సృష్టించగలం—

నా: (విశ్వాన్ని ఉద్దేశించి) పేదలకు ఏ దారిజూపినా మీరే గదయ్యా!

విశ్వం: మన్లో యీనాడు పేదలూ ధనికులూ అనే భేదా లుండొచ్చు కానీ, మనం మానవజాతన్నమాట మరిచి పోగూడదు. ఏనాటికైనా నిరంకుశ స్వార్థత్వాన్ని నాశనంజేసి సమానత్వపు సౌందర్య తేజాన్ని చూడ గలుగుతాం—

గో: శాంతికిరణపు కాంతి బింబాన్ని సృష్టించగలం!

సు: అమృతపు ప్రశాంతాన్ని నెలకొల్పాలి—

గో: పేదల్ను పీల్చి పిప్పి జేస్తున్న ధనికవర్గాన్ని దగ్ధంజెయ్యాలి.

కాం: (ఆవేశంతో) కళ్ళకు పొరలుగమ్మిన ఐశ్వర్యంతో నీతి మాలి ప్రవర్తించే వెంకట్రామిరెడ్డికి తగిన బుద్ధి జెప్పాలి—

విశ్వం: లంచాలకు తలవంచి ఆయన చెప్పుచేతుల్లో నడు స్తున్న గవర్నమెంటు అధికారులకు మనం నీతిజెప్పాలి.

గో: యీనాడు దేశమంతటా లంచాలు. ఎటుజూచినా ప్రజల్ని దోచుకొంటున్న, అవినీతిని ఎదుర్కోవాలి.

విశ్వం: మనదేశంలో పేరుకు ప్రజాప్రభుత్వం—కానీ లాభం? ఆనాటి నిరంకుశ ప్రభుత్వం యీ పాలనలో మచ్చు తునక—

గో: ప్రజల శ్రేయస్సుకోరే ప్రభుత్వమైతే పదవులకొరకు పోరాటమెందుకు ?

సు: బలవంతంగా ప్రజల్ని పీడించి గద్దెకెక్కడం, ఆనాటినుండి స్వార్థంతో పేదల్ను పీల్చి పిప్పిజేయడం, యిదేనా స్వాతంత్ర్యదేశం?

వీ: ఐనా డబ్బుందని ఓట్ల సమయానికి రూపాయిలు ఎగజల్లి పేదోళ్ళకు ఆశబెట్టి గెల్చుకొంటారు—

నా: పేదోళ్ళేం జేస్తారు ఒక్క-నాడైనా కడుపునింపుకోవచ్చని ఆశ అంతే—

విశ్వం: ఒక్కనాడు ఆకలి నింపుకొన్న ఫలితం, యావజ్జీవం స్వార్థపాలనకు ప్రాణాలర్పించడం జరుగుతూవుంది.

గో: (ఉద్రేకంగా) ప్రతివ్యక్తికీ ఓటు హక్కుంది. ఆ ఓటే మానవజీవితాన్ని సూచింపజేసే యోగ్యతాపత్రం, అలాంటి పవిత్రమైన ఓటును విలువలేకుండా ఒక్క పూట కడుపునింపుకోవడానికి రూపాయి డబ్బులకు ఆస్వార్థపు అవినీతి ధనికులకు పదవులకొరకు తహతహలాడే దుర్నీతి, దుర్మార్గులకు ధారబోసిన ఫలితమే యీనాడు అధికారం చలాయిస్తూ మనల్ని పశువుల్నిజేసి ఆడిస్తున్నారు!

విశ్వం: యికనైనా పేదప్రజలు గ్రహించి ధనికవర్గపు మారణభూతాల పన్నాగాలకు లోబడకుండా వ్యక్తిత్వం కాపాడుకొన్ననాడే అశాంతి దేవతను పారదోలగలం.

సు: అప్పుడే ధర్మరాజ్యాన్ని స్థాపించుకోగలం.

వీ: ఆనాడుగాదు పేదోళ్ళనంతా దొడ్లలో తోలిఓటు చెయ్య

నీమందా దొంగచాటుగా గెల్వడం! యీసారిగదా బండారం బైటబడేదీ....

నా: ఐనా రాక్షసత్వం ప్రవర్తించారు పేదలపైన—

కాం: ఆ విషనాగుల్ని పాలుబోసి పెంచుకొన్నది మనమేగా, అందుకే తగిన ఫలితం అనుభవిస్తున్నాం.—

విశ్వం: ఏనాడైనా ప్రజలు నిర్ణయించిన శిక్షను వాళ్ళనుభవించక తప్పదు—

సు: న్యాయంముందు చేతులు కట్టుకొని జవాబు చెప్పుకోవాల్సిన రోజొస్తుంది.

గో: ప్రస్తుత నిరంకుశపాలనకు దండనే జరిగితీరుతుంది—

సు: యీనాడు మన గ్రామాలలో జరిగే దౌర్జన్యాన్ని రూపుమాపగలిగితేనే దేశపరిపాలనను ఎదుర్కోగలం—

కాం: పేదల్ను దోచుకొంటున్న యీ దౌర్జన్యపాలన ఏనాడంతమౌతుందో?

నా: (ఉద్రేకంగా) కష్టజీవుల విప్లవ శంఖం మోగిన్నాడే!

విశ్వం: నిర్భాగ్యుల విజయదుందుభి మోగిన్నాడే?

గో: బ్రతుకు చెరకు కృంగి కూలే బానిసలు విప్లవపదం పాడి ముందుకు నడచిననాడే శాంతి సత్యలోకాన్ని స్థాపించగలం—

సు: ఆనాడే సౌఖ్యాన్ని అనుభవించగలం—

విశ్వం: అప్పుడే సర్వసమానమనే దివ్య ప్రేమజ్యోతి వెలుగును జూడగలం—

గో: నిరవధికమైన నిరంకుశపాలన ధైర్యంగా స్థయిర్యంగా ఎదిర్చి నిర్మూలం జేయగలిగిన్నాడే దేశంలో సర్వ సమానత్వాన్ని నెలకొల్పగలం, ప్రపంచానికే ఆదర్శలం కాగలం—

విశ్వం: అష్టచాకిరితో కష్టాలకుపాలై ఆకలిదేవతకు బలిగా మారెడి అన్నార్తులు లేవాలి, నడవాలి, చిరకాలం పెరుగుతున్న మానవస్వార్థ పిశాచాన్ని తునాతునకలు జేయాలి, మానవత్వాన్ని చాటాలి, మనుష్యులంతా సర్వసమానమని నిరూపించాలి!

గో: ఆలాంటి శాంతిశుభోదయ తేజం గల్గిననాడే భూస్వామ్య ధనవంతపు స్వార్థత్వం నశిస్తుంది. వాళ్ళ ప్రాణాలకు అడక త్తెరలా, వాతావరణం ఏర్పడగలదు –

విశ్వం: స్వార్థంతో చెలరేగుతున్న మారాజులు పేదప్రజల్ను కబళించారు. యికనైనా పేదలు మేల్కొని, అవినీతి అధోగతిని గమనించి చరిత్రలో సమానత్వ శుభోదయ గీతాన్ని అవలంభించాలి.

సు: ఒక్కడి సుఖంకొరకు అనేకమందిని హింసిస్తున్న దుర్నీతిని హతమార్చాలి –

విశ్వం: స్వార్థపు నియమాలకు కట్టుబడిన ప్రజాశక్తిని మేల్కొల్పాలి –

శ్యాం: కళ్లుకానని ఐశ్వర్యపు మత్తుతో ప్రపంచాన్ని కఠినంగా పంపాలిస్తూ కలుషం జేస్తున్న మారాజులకు బుద్ధి జెప్పాలి.

విశ్వం: ఆకటితో కూలిపోతున్న నిర్భాగ్యులు, అశాంతితో కృంగిపోతున్న నిరుపేదలు, యిక లేవాలి. తరతరాలుగా జీర్ణించుకుపోయిన ధనికుల దౌర్జన్యాన్ని తెగటార్చాలి.

సు: న్యాయమడిగితే పార్టీలనడం, పేదలం కడుపు కరువుతో సస్తున్నాం అంటే, పూర్వపుణ్య ఫలమేనని అనుభవించాలని బుకాయించే యీ పాపిష్టిలోకంలో, స్వాతంత్ర్యమంటే యిదేనా, యిదేనా సర్వసమాన సౌభ్రాతృత్వం?

విశ్వం: యీ స్వాతంత్ర్య దేశంలో ఆకటిదేవతకు బలైపోతున్న పేదలు సోషలిజపు పతకాలను చెవులారా విన్నంతమాత్రాన ప్రాణాలను నిలుపుకోలేరు. అందుకు మనమంతా పోరుకాడాలి –

కాం: రక్తం ధారబోసి పనిజేసినా కనికరం జూపని పాపిష్టి లోకం పేదల్ని నీచంగాజూచి దూరంగా తరుముతుంది.

గో: లోకంలో ధనవంతులు పుట్టుకతోనే సిరిసంపదల్తో పుట్టారా? హుఁ....దయా, ధర్మం మరచి సుఖాల కొరకు స్వార్థంతో, తోటి మానవజాతిని, అమాయకుల్ని పేదలనే కఠోరవర్గ భేదానికి గురిజేశారు.

విశ్వం: పూర్వకాలంనుండీ నడుస్తున్న చరిత్రరూపం గూడా అంతే. ఉన్నవాణ్ణి కీర్తించి లేనివాణ్ణి అణగద్రొక్కిన, ధనవంతుల నినాదబాకా.

సు: పేదల రక్తాన్ని పీల్చి ప్రశాంతాన్ని పొందుతున్న ధనవం

తుల పన్నాగాలు యిక సాగవు. గత చరిత్ర మారి తీరుతుంది.

వీ: (కోపంగా) ఏంటో పన్నాగాలంట పన్నాగాలు! మనం అనుకోంటూ చూస్తూవుంటే అసలు మన ప్రాణాలకే మోసం, ఎంకట్రామిరెడ్డి జేసేపన్లు ఆఁ –

కాం: ఆయనకేం, ప్రభుత్వంలో మాట సాగినోడు. మన ప్రాణాలు నిలవనా తీసినా, అడిగే దిక్కులేదు.

గో: యీనాటి ప్రభుత్వం ఉన్నవారి చేతిలో కీలుబొమ్మ కాబట్టేగా యీ ధనవంతులు ఆడింది ఆటగా, పాడింది పాటగా ఉండడం!

నా: ప్రభుత్వం జేస్తున్నదే యీనాడు ధనవంతులైతే, మల్లా ప్రభుత్వం అంటూ ఉందా? ధనవంతులే ప్రభువులు మనకు.

విశ్వం: మంచిరోజులొస్తాయని మనం నీళ్ళు నములుతుంటే మానాభిమానాలు మంటగలిసే రోజు లొస్తాయి.

సు: (తాపీగా) తొందరపడితే ఏం లాభం నాయినా?

గో: (కోపంగా) తొందర – తొందరపడక చేతులు నలుపుకొంటూ కూర్చుంటే ఎన్ని కూనీలైనా, ఎన్ని మానభంగాలైనా జరగతాయ్!

[పుల్లడు పరుగెత్తుకొంటూ వచ్చి విశ్వం కాళ్ళమీద బడతాడు అందరూ ఆశ్చర్యపడ్తారు.]

వీ: (కోపంతో ఉద్రేకుడై పుల్లడిపై కురుకుతూ) యిక్కడికే వచ్చాడు కూనీకోరు దొంగముండా కొడుకు వీడి రక్తం కళ్ళజూస్తా!

సు: (వీరయ్యను స్థిమితపరుస్తూ) ఆఁ, ఆఁ – ఆగు ఏంటా తొందర!

పు: అయ్యోగోరా, (పైకిలేచి సుబ్బారెడ్డి నుద్దేశించి) అయ్యోగోరా నన్ను రచ్చించండి సామే, నాకు బుద్దొచ్చింది, యికన అన్యాయపు పనులుజైను, నా బిడ్డలుసాచ్చిగా–

గో: నిన్నెవ్వడా నమ్మేది, నిలువునా గొంతులు నరికేవాడివి!

పు: అందుకే నయ్యోగోరా, అనుభగిత్తాఉండా! (కృంగి పోతాడు.)

కాం: చేసేపన్లు, ఘాతకపు పన్లేగా అనుబానికి రాకుండా ఎక్కడికి పోతాయిలే!

పు: (దుఃఖంతో) అను తల్లే, అను నిజమైనమాట యెన్నిసార్లయినా అను——

విశ్వం: (జాలిగా) ఏంటోయ్ నీ యెత్తు – అసలు కారణం ఏంటో?

సు: ఏం ఉంది, యిప్పటికి లోకం తెలుసుకోనుంటాడు, అంతే!

నా: ఎంత క్రూరుడైనా, దెబ్బ తగలందే లోకం తెలుసుకోకుండా ఎట్లా ఉంటాడు, అంతపనీ జరిగినట్లే ఉంది——

గో: (నారయ్య నుద్దేశించి) పెద్దవాళ్లు మీకేం తెలుస్తుంది, యీలాంటి కూనీకోర్ల విషయాలు – అందితే జుట్టు లేకుంటే కాళ్లు వీళ్ళ రూపాలు.

పీ: అంతే, అంతే ఏంటో పెద్దత్తే యిది – ఆఁ.

విశ్వం: ఆఁ – ఎందుకో మొత్తానికి పద్మయూహం పన్నారు.

పు: (దీనంగా) నేను చేసిన ఘాతకాలకి మీరేవన్నా అనండి. పిల్లోళ్ళుగల్లావోణ్ణి, నాకు బుద్ధొచ్చింది, మీ పాదాలకి మొక్కుతా నా తప్పులు చెమించి మీలో జేరుచుకోండి!

సు: (జాలిగా) పాపం, తెలివిదెచ్చుకొన్నాడు అమాయకుడు. వీణ్ని మనం యింకా అనుమానించడం భావ్యంగాదు–

విశ్వం: యింతలోనే, యింత మార్పు రావడానికి, ఏదో కారణం ఉండాలి—

గో: నా అనుమానం అదే, తప్పకుండా ఏవో పెద్ద కుతంత్రం జరుగుతూనే ఉంది.

నా: ఉండాదుగా–రెడ్డిగారి మంత్రి గున్నయ్యా, ఏదో పన్నాగం పన్నే ఉంటాడు!

కాం: పశువులు, ఎంతపనికైనా వడిగడతారు!

సు: (సునాయాసంగా) వాళ్ళు తాడు, ఎంత కుట్ర జేసినా, ఆ ఫలితం వాళ్లకే గొడుతుంది తప్పదు—

కాం: అంతేగా మరి, ఎవరు తొవ్వకొన్నా గోతిలో వాళ్ళే పడ్తారు!

పు: అవును కాంతమ్మగోరూ, రెడ్డోరు పెద్దాలోచనే జాత్రా ఉండాడు, సుబ్బారెడ్డిగోర్ని చంపించాలని—

వీ: (మీాది కుదుకుతూ) ఛా - నువ్వుమాత్రం సంపడానికి గండప్తో కలిసిరాలేదంట్రా, యిప్పు డెవురో చంపడానికి పూనుకొంటుండారని దొంగేశాలేస్తావుండావ్!

పు: అవునీరయ్యగోరూ, నా బుద్ధి గెడ్డి తినింది యిఁన రెడ్డోరి మాట్లిన్ను - ఆఁ.

గో: (తీక్షణంగా పుల్లణ్ణుద్దేశించి) నీమాటలు నమ్మేదెట్లోయ్!

విశ్వం: (పుల్లణ్ణి సమీాపించి) నువ్వు, - రెడ్డిగార్తో కలిసి, ఎన్ని ఘాతకాలు జేశావో నువ్వు బాగుపడిందేమైనాఉందా? అసలు నీ బిడ్డలు పస్తులేకుండా గంజితాగడానికైనా నోచుకొన్నారా?

పు: (భోరునేడ్చి) అవునయ్యగోరూ మంచినీళ్ళగ్గూడా కరువై నా సంటోణ్ణి సంపుకొన్నా. యికన బుద్ధిగలిగి కష్టపడి పనిజేసుకొంటూ నన్ను రచ్చించు చిన్నరెడ్డిగోరూ___

సు: (జాలిగా వోదారుస్తూ) యిక్నైనా బుద్ధిగలిగి కష్టం జేసుకో పుల్లుగా! అన్యాయాలు జెయ్యకుండా.

పు: యికన అట్టాటి పాపిష్టిపు పనులు జైను సుబ్బయ్యగోరూ (చెంపలేసుకొంటూ) బుద్దొచ్చింది, యికన.

వీ: (హేళనగా) కుక్క దాలిగుంటలో పండుకోనున్నంత సేపూ, కూటికుండలిక ఎక్కడా తొయ్యకుండా నిజాయితీగా బతకాలనుకొంటుందట. గుంటలోనుండి లేచిన క్షణమే ప్రారంభం, కుండలు దొయ్యడం. అట్నే ఉన్నట్టుంది పుల్లాయి మాట్లు___

గో: (నిర్దాక్షిణ్యంగా పుల్లణ్ని ఉద్దేశించి) నిన్ను నమ్మడానికి వీల్లేదు: మాతో కలిసి, మెలిసే మాకీ ద్రోహం జేసేటంత క్రూరుడివి నువ్వు—

నా: (అనుమానంగా) యిలాంటి పరిస్థితుల్లో పుల్లాయిని మన్లో జేర్చుకుంటే మనకే మోసం జరగొచ్చు—

పు: (అమాయకంగా) ఉవున్నారయ్యా సావేఁ, నేను జేశిన ద్రోహాలు నీకు తెల్టకుండా బోయ్యాయా? సావీఁ సాచ్చిగా యికన అట్టాంటి పన్లకి రాను. నా బిడ్డలు సాచ్చిగా కావాలంటే ఏం పెమాణమైనా చాత్తా-ఆఁ-

విశ్వం: ప్రమాణాలు అనవసరం, నీకు నువ్వు, నీతిగా, న్యాయంగా బ్రతికితే చాలు.

పు: యికన నీతిగా ఉంటాను, చిన్నయ్యగోరూ.

గో: ఆఁ - అదెంతవరకో సూస్తాంగా!

కాం: పుల్లాయి మన్లోనుండి పొయ్యేటంతవరకూ, నీతిగా ఉంటాడు.

వీ: సత్యం పలికావమ్మా! అంతే, అంతే.

సు: చేసిన తప్పులొప్పుకొని, మన ఆశ్రయం గోరేవాణ్ణి. మనం యింకా అనుమానించడం, న్యాయంగాదు.

పు: (సుబ్బారెడ్డి కాళ్లు పట్టుకొని పైకిలేచి) మిమ్మల్ని చంపడానికి వచ్చిన యీ ద్రోహుణ్ణి కాపాడు సుబ్బయ్యగోరూ, యీ పాపిట్టోణ్ణి రచ్చించు అయ్యగోరూ—

విశ్వం: (ఉత్సాహంతో) ఏనాటికైనా మన సత్యం జయించి తీరుతుంది, మన నీతి మానవసంఘానికే ఆయుర్దాయం అవుతుంది తప్పదు!

సు: ఔను! మనం, నీతిగా పాటుబడుతుండబట్టేగా, (పుల్లణ్ణుద్దేశించి) ఏమీ తెలియని అమాయకుడు పశువులా ప్రవర్తించే కూనీకోరు యీనాటికైనా లోకం తెలుసుకొని మన నీడన నిల్చుకోగలగడం -

పు: (అమాయికంగా) అవును సుబ్బయ్యగోరూ, నాకు లోకం తెలిసింది, మారాజులంతా అన్యాయిపోళ్ళే, వాళ్ళు లేనిపోని ఆశిలుబెట్టి వాళ్ళపనులు చెయించుకొని అవతల మొఖంగూడా జూడ్రు - ఆఁ -

కాం: (పుల్లణ్ణుద్దేశించి) ఎంత బుద్ధిమారి మాలోకొచ్చినా నీ కసాయితనం, మాటల్లోనే తెలుస్తుందిగా - వెంట్రామిరెడ్డి నిన్ను పెద్ద ధనవంతుణ్ని జెయ్యలేదనేనా, మాలోకొచ్చింది నువ్వు? ఆ మారాజు ప్రజల్దగర దోచుకొంటున్న సొమ్ములో నూరోవంతు నీకు చెల్లినా, యదాప్రకారం కూనీలు, అన్యాయాలు జేస్తూఉంటావన్నమాట.

వీ: చిన్నదానివైనా భలే అడిగావమ్మా, రెడ్డిగారిదగ్గర బాణం పారకపొయ్యేటప్పటికి, ఉచ్చులు తెంపుకోనొచ్చినట్టే ఉంది -

నా: (ఆలోచనగా) ఏదో కుట్రజరుగుతుంది, రెడ్డి నెకటా

యించితే, పుల్లాయి ప్రాణంతో మల్లా యిక్కడికి రాబోయేవాడా?

గో: పొద్దునలేస్తే, ఆయిన కోరల్లోనే! ఆయన బంగారు పళ్ళెంలో ఎంగిలి మెతుకులకు, నీతీ, నిజాయితీ సంపుకొనేవాడు ఒక్కసారి బుద్ధి మార్చుకోవడం, ఏదో దొంగైతే –

వీ: అంతే గోయిందయ్యా! లేకుంటే పుల్లిగాడేంది, యింతగా మారిపొయ్యేదేంది. యిచిత్రమే –

పు: (నిట్టూర్పుతో) అవును – నేను జేసిన పన్లకి మీరు రెట్టా నన్ను నమ్ముతారు నాబోటి రాచ్చిసోణ్ణి మీరనాను దగ్గిరికి తీత్తారనుకొన్నా, ఆ యాశీ బొయ్యింది –

సు: (జాలిగా) అదిగాదు పుల్లాయి! నువ్వు నీతిగా, ధర్మంగా మెలిగే పనైతే, మా సంఘం, నీ తప్పుల్ని తప్పకుండా మన్నిస్తుంది, ఆc –

పు: లేనిపోనాశితో! రెడ్డి చెప్పినట్టల్లా జేశి పెద్దోళ్ళిళ్ళల్లో దొంగతనం జేశా. నా పాపిట్టి చేతలతోనే, ఎన్ని కూనీలు జేశానో (మొఖాన చేతులుంచుకొని బోరు నేడుస్తాడు).

విశ్వం: (పుల్లణ్ణి సమీపించి బుజాన చెయ్యేసి, ఓదారుస్తూ) జరిగిందేదో జరిగిపొయ్యింది, ఎందుకలా బాధపడ్తావ్, పుల్లాయి, యికనుండి మాలో నేఉండు, కష్టపడి పని జేసి, నీతీ, న్యాయంగా బ్రతుకుతే చాలు!

పు: (సంతోషంతో వణికిపోతూ విశ్వం కాళ్లు జవిరి పట్టుకొని) అంతే చాలు చిన్నయ్యగోరూ, యీ పాపిట్నోణ్ణి, అంతమాత్రం ఆదరిత్తే చాలు.

విశ్వం: (పుల్లాయిని లేవదీసి) న్యాయంగా నీ కర్తవ్యాన్ని నువ్వు నెరవేర్చుకొంటే చాలు. దేవుడు నువ్వు జేసిన తప్పులు తప్పకుండా క్షమిస్తాడు—

పు: అట్నే నయ్యగోరూ, కట్టపడి పనిజేసి నా పిళ్లోళ్ళని బతికిచ్చుకొంటా యికన. నాయినగోరు చెప్పిన అన్యాయపు పనులు చైనే చైను-

గో: (పుల్లణ్ణి సమీపించి) వెంకట్రామిరెడ్డి జేసె, దుర్నీతి పనులను ధైర్యంతో ఎదుర్కొంటావా?

శాం: అప్పుడు తెలుస్తుంది పుల్లాయి నిజాయితీ!

పీ: (పుల్లణ్ణుద్దేశించి) అన్ని దొమ్మలుంటేనే మాలోకిరా!

సు: (కోపంగా) ఎందుకీరయ్యా, ఎల్లేవాళ్ళను తరమడం?

విశ్వం: (సుబ్బారెడ్డి నుద్దేశించి) ధనవంతులు జేసే పన్నాగాలకు లొంగిపొయ్యే అమాయకుల్ని ఆమాత్రం గట్టిగా పరీక్షించకపోతే, ఏలాగు లేండి!

గో: (పుల్లణ్ని సమీపించి వీపునతట్టి) ప్రజల్ని దోచుకొని మేడలుగట్టి, పేదల పచ్చినెత్తురు తాగే మానవరాక్షసుల అవినీతిని మాపుమాపడానికి మా సంఘం, కంకణం కట్టుకొంది. యీనాటినుండీ మా సంఘంలో బాధ్యతలో భాగం నీకూ ఉందని తెలుసుకో!

విశ్వం: యీ మానవప్రపంచంలో స్వేచ్ఛగా జీవితం గడిపే సౌఖ్యం పేదల కెందుకులేదో తెలుసుకో పుల్లాయి.

పు: (తెల్లబొయ్యి అమాయకంగా) నాకేం తెలుసు చిన్నయ్యగోరూ, అచ్చిరం ముక్క తెలీని దున్నపోతోణ్ని-

విశ్వం: నిరంకుశులు, స్వార్థపరులు అవినీతి పరాయణులు, మీలాంటి అమాయకుల్ని చేరదీసి, ఆశబెట్టి, వాళ్ళ ప్రభుత్వాన్ని జరిపించుకొంటున్నారు. నీలాంటోళ్ళు నీతిగా ప్రవర్తిస్తే చాలు భోగభాగ్యాలతో కళ్ళకు పొరలుగమ్మి సంచరించే రాక్షసుల్ని రూపుమాపొచ్చు మనుష్యులంతా సమానమనే నవీనయుగం ప్రారంభమౌతుంది తెలుసా?

గో: సాహసం ఉంటే యీ గ్రామంలో నిరంకుశంగా ప్రవర్తిస్తూ అధికారం చలాయించుకొంటున్న వెంకటరామిరెడ్డి నెదిరించు, అన్యాయం ఎదుర్కోవడం మా ఆశయం కాబట్టి, మాతో ఏకీభవించు!

పు: (ఉద్రేకంగా) నా ప్రాణం పొయ్యినాసరే రెడ్డోరు జేసే ఘాతకాలు యిక నొప్పుకోను-ఆఁ-

గో: ఏ పరిస్థితుల్లోగూడా బుద్ధి మార్చుకోవ్వుగదూ?

పు: సూత్తారుగా గోయిందయ్యగోరూ! పుల్లుగోడి సంగతే!

నా: పేదోళ్ళకు, నీతే ప్రాణం, మానం. ఏం చేస్తావో చూదాం.

పు: ఏంది నారయ్యిగోరో, పుల్లుగోడు మొండిపట్టోడు, యవారం బడిందంటే, అటో యిటో అంతే. ఆఁ ఏఁవను కొన్నావో?

కాం: పుల్లాయి, యింతగా మారిపోతాడని యెవ్వరను కొన్నారు. యిదంతా మన మంచికో చెడుకో అర్థం కావడంలే-

సు: ఏంటమ్మా అలా అంటావ్, అధర్మంగా ప్రవర్తించే మానవుడు ఏనాటికైనా, న్యాయమనే నీడలో నిల్చు కొని తన్ను తాను గ్రహించుకొని సవరించుకోకుండా బోడు___

విశ్వం: (పుల్లణ్ణుద్దేశించి) యీనాటినుండీ నీ శాయశక్తులా అన్యాయాన్ని ఎదిరించు, అక్రమాన్ని పటాపంచలు జెయ్యి. ప్రపంచంలో మానవత్వపు బాధ్యత నిర్వర్తించుకో!

గో: విశాలమైన మేడల్లో మైమరచిన సౌఖ్యాలతో యెవ్వన శ్యామల ప్రేమడోలికలో తూలు మానవరాక్షసులకు మానవత్వం చాటాలి___

విశ్వం: అనేకమంది పేదలు, అమాయకులు, అహోరాత్రులు కష్టించిన సొమ్మును దుర్వినియోగం జేస్తున్న, వికృత రూపుల్ని ఎదుర్కోవాలి___

పు: (ఉద్రేకంగా) నా ఊపిరి పొయ్యినాసరే, యిక నా గండడు జేసే బోధన నే నొప్పుకోను, అంతే. ఆc___

కాం: ఆ గండడితో తగులాట పెట్టుకోకు పుల్లాయి. వాడు తగ నోడు. (భయాన్ని ప్రకటిస్తూ) ప్రాణాలుతీసం అంటే వాడికి మంచినీళ్ళప్రాయం___

పు: (నిర్భయంగా) ఏంది కాంతమ్మగోరూ, ఆ ఎధవనాయాలు నన్ను జేసేదే, పుర్రె రామకీర్తం పాడిస్తా, ఆఁ—

నా: అట్లాగని, ముందుగా నువ్వే దుడుకుపడ్తావేమొ పుల్లాయి జాగ్రత్త!

పీ: దుడుకేం, దుడుకు నారయ్యా? మనం న్యాయమనిపించుకోవాలి గాని!

సు: యిందులో ఎవరూ దుడుకుపడాల్సిన అవసరంలేదులే. ఏలాంటి అన్యాయపు పన్లు వాళ్ళు జేసినా, దేవుడు వాళ్ళకే తగినశాస్తి జేస్తాడు. తప్పదు—

గో: (కోపంగా) ఎప్పుడూ, దేవుడు, దేవుడని యింతవరకూ దోసుకొచ్చావు. యింకా ఆ నీతే ఉపయోగించావంటే వెంకట్రామిరెడ్డి జరిపే కార్యాలు ఏ ఆటంకమూ లేకుండా జరిపించుకొంటాడు, మన ఆశయాలన్నీ బూడిదలో బోసిన పన్నీరవడం, తథ్యం! తప్పదు.

సు: మనందరం, ఆయన్ని న్యాయంగా ప్రవర్తించమని మనవి జేసుకొందాం. ఆమాత్రం అయినా అంగీకరిస్తే చాలు, మన బాధ్యత మనం నిర్వర్తించుకొన్నట్టే!

విశ్వం: ఆఁ....మంత్రాలకు మామిడికాయలు రాల్తాయా?

సు: అంతకన్నా, ఆయనగార్ని మనమేమి జైగలం విశ్వం?

గో: ఏం జైగలవాఁ...హుఁ, గ్రామంలో ఆయ సిష్టంవచ్చినట్లు జరిపే దౌర్జన్యాన్ని, ఆ మన రౌడీచర్యల్ని రూపుమాపగలం తెలిసిందా,

సు: అంత ఉద్రేకం దేనికయ్యా? ఆయన చెప్పుచేతుల్లో ప్రభుత్వం ఉంది, ఆయనను కొంటే మనల్ని ఏమైనా జెయ్యగలడు—

విశ్వం: ఏమైనా జేసేదేంటి యిప్పుడు జేస్తున్నది చాలకనా,

కాం: (కోపంగా) ఆయన చేతకొచ్చిన పనులన్నీ యిప్పుడు జరుపుకొంటూనే ఉండాడుగా!

గో: (కోపంగా) జరపకేం! రాతు మెత్తనైతే గుఱ్ఱం మూడు కాళ్ళతో నడుస్తుందని సామెతుందిగా!

వి: యింతా, మనం చాతగానోళ్ళం కాబట్టే రెడ్డిగారు యిష్ట ప్రకారం ప్రభుత్వం చలాయించుకొంటుండాడు—

సు: (తాపీగా) ఎదిరించడాని కెంతసేపీరయ్యా, వెంకట్రామి రెడ్డి ఎన్ని వికృతకార్యాలు జేసినా, ఆయన్లో మంచిని కూడా పాటించాలి.

గో: హుఁ—ఆయనలో మంచని, దయని, ధర్మమని, ఇన్నుంటే యింకేం, ఆయన గౌరవానికి లోటొస్తుందని ఆయనంతస్తు తగ్గుతుందని కడుపునబుట్టిన కొడుకును దూరం జేసుకొన్నాడు. ఆయన గ్రామంలో జరుపుతున్న రాక్షసకృత్యాలకంతమేది? యిదేనా ఆయన మంచి.

విశ్వం: డబ్బును ఆరాధించే వాళ్ళకు భార్యా, బిడ్డలు, నీతి, న్యాయం, మానవత్వం అనే అనుబంధాలెందుకుంటాయ్? వాళ్ళ గౌరవప్రతిష్టలకొరకు, అష్టయిశ్వర్యాలకు ఎన్ని దారుణకృత్యాలైనా జేయగలరు. అందుకెనుదీయరు!

పు: (ఆదుర్దగా) అవునయ్యోగోయ్యా! యిప్పటిదాకా నాయి నిచ్చిన డబ్బుల కాశిపడి, ఎన్నో బందిపోట్లు జేశా. అట్ట జేసినాగూడా, గెంజికి దిక్కు లేక నా సంటోణ్ణి గూడా చంపుకొన్నా - (కృంగిపోతాడు).

విశ్వం: (ఓదారుస్తూ) భాగ్యవంతులంతా అంతే పుల్లాయి! కొంతమంది అమాయకుల్ని చేరదీసి లేనిపోని ఆశలు బెట్టి వాళ్ళ స్వార్థం నెరవేర్చుకొంటారు.

కాం: యిట్లాంటి లోకంలో ప్రతిమనిషికీ వ్యక్తి స్వాతంత్ర్య మట? ఎక్కడబట్టినా, ఒకడి సౌఖ్యంకోసం, పది మంది సంసారాలు నాశనంజేసే యీపాపిష్టి లోకంలో!

గో: హుఁ.... స్వాతంత్ర్య కాంతుల తేజంలో, స్వార్థం విజయ వంతంగా తలెత్తిందిగా! పేదల జీవితాన్ని రూపుమాపే మహామ్మారి రూపమైందిగా!

కాం: ఆ మహమ్మారి బలంతోనే మనల్ని నాశనంజేసె బలం సంపాదించారుగా!

వీ: (కోపంగా) యికిన వెంకట్రామిరెడ్డి సంగతి అటో యిటో తేలిపోవాల్సిందే - ఆఁ—

సు: (తాపీగా) మనుష్యులతాహాతు తెలుసుకోకుండా ఉద్రేకం కావడం, మనకే అపాయం వీరయ్యా!

గో: తాహాతలెంచుకొని అపాయమొస్తుందని ఆలోచిస్తుంటే ప్రస్తుతం జరిగే కుట్ర ఆపదల్లో అందరం బలిగావా ల్సిందే తప్పదు!

విశ్వం: (సుబ్బారెడ్డి నుద్దేశించి) యివాళ నిన్ను ఖూనీ జేయ డాని కొచ్చిన వైపరీత్యం, దేవుడిదయవల్ల అనుకోని రీతిగా తప్పిపోయిందిగాని లేకుంటే ఏమైనా ఉందా?

సు: అవున్నాయినా, వాళ్ళ ఘాతకం వాళ్ళకే గొడుతుంది తప్పదు.

పు: (పశ్చాత్తాపంతో) అవును సుబ్బయ్యగోరూ, నీకే దోహం జెయ్యడానికి పూనుకొన్నా పాపిట్టోణ్ని—(కృంగి పోతాడు).

నా: నువ్వేంజేశావు పుల్లాయి, రెడ్డి పురిగొల్పితేనేగా అమాయ కంగా ప్రవర్తించావ్!

పు: అవును సావే - ఆయన షూట్లినే మిమ్మల్ని పగజేసు కొని అనుభగిత్తాఉండా!

వీ: అనుభగించే దేవిఁటి పుల్లాయ్, ఆయనకి తగిన బుద్ధి జెప్పాలగాని—

గో: మనమందరం గలిసి, ఆయన్ను నిర్భయంగా ఎదుర్కొంటేనే దానికి సాహసించాలి.

విశ్వం: అప్పుడే మనం దేశానికి సేవజేసినవాళ్ళు కాగలం!

గో: మానవత్వాన్ని నిలబెట్టుకొన్నవాళ్ళం కాగలం!

కాం: పేదోళ్ళను అవస్థలుపెట్టి హింసించే రాక్షసులు ప్రపం చంలో ఉన్నంతవరకూ కాలం యిలానే కాలిపోతుం టుంది—

సు: న్యాయంగా ప్రవర్తించి, ప్రజల్లో గౌరవంగా ఉండమని రెడ్డిదగ్గర ప్రాధేయపడదాం.

వీ: ఆయన రాతిగుండోడు మనమాటింటాడా, కల్లోమాటే!

పు: (భయాన్ని ప్రకటిస్తూ) అవునీరయ్యాగోరూ, ఆయన భలే చెడ్డమణిసి.

కాం: ఆయన నిరంకుశపు అవినీతిపనుల్తో, ప్రపంచాన్ని ఏం జెయ్యగలడు?

నా: (కాంతమ్మ నుద్దేశించి) వాళ్లు డబ్బుగల్లోళ్ళమ్మా ఏం వైనా జేసే శక్తి వాళ్ళకే ఉంది—

పు: ఆయన డబ్బుకి ఆశిపడి ఎట్టాంటి నీచమాలిన పనికైనా సిద్ధంగా ఉండేది మాబోటోళ్ళేను నారయ్యగోరూ?

గో: యిప్పటికైనా మించిపొయ్యిందిలేదు పుల్లాయి మన మంతా ఒక్క బిగువున పోరకాడామంటేచాలు, మన హక్కుల్ని మనం సంపాదించుకోగలం.

విశ్వం: బీదలంతా పిడుగులై కంకణం కట్టుకొన్ననాడే మన ఆశయం నెరవేరుతుంది! వాళ్ళ వాళ్ళ కర్తవ్యం వాళ్లు నెరవేర్చుకొన్ననాడే ప్రపంచంలో ప్రశాంతి నెల కొల్పగలం పుల్లాయ్—

పు: (ఉత్సాహంగా) అందుకని మనం రెడ్డోర్ని యెదురు కొందాం—అంతే.

విశ్వం: తప్పకుండానయ్యా, మన న్యాయం, మనం నెరవేర్చు కొందాం!

గో: ప్రపంచంలో న్యాయాన్ని సాధించడానికి ఎవ్వరిని లెక్క చేయగూడదు.

విశ్వం: మానవుడు న్యాయంకోరకే పుట్టాడు, అలాంటి పవిత్రమైన కార్యాన్ని నెరవేర్చలేక, సాధించలేక స్వార్థపరుల కర్కశపాశానికి బలైపోతున్నాడు. అలాంటి నిరంకుశాన్ని పటాపంచలు జేదాం!

గో: (ఉద్రేకంగా) మన నీతికల్లా ధైర్యమే మనకు రక్ష -

విశ్వం: మన నిస్వార్థపుటాశయాలే పేదప్రజల సోపానాలౌతాయి తప్పదు.

పు: (ఆవేశంగా) యికన నా ప్రాణం బోయ్యినాసరే నీతిగా బతికేత్తా-ఆఁ.

కాం: మన పేదోళ్ళాస్తి, నీతేగదంట పుల్లాయి -

పీ: యీ గ్రామంలో రెడ్డిజరిపే అన్యాయాల్ని, తేల్చుకోవాల్సిందే అటో-యిటో-ఆఁ.

సు: తొందరెందుకు? నిదానంగానే న్యాయమడుగుదాం -

విశ్వం: (భారతమాత విగ్రహానుద్దేశించి) భారతమాత శుభోదయ శాంతి సమత్వానికి మనమంతా కృషిచేద్దాం. ఆ తల్లిహృదయానికి నిర్మలత్వం, నెలకొల్పుదాం.

గో: (ఉద్రేకంగా పాట మొదలుపెడ్తాడు పాటలో అందరూ కల్సుకొంటారు.)

కదలండోయ్ — కదలండోయ్
నరజాతి నగారా పలికిందోయ్

సుప్రభాత జగత్ జ్యోతి
వెలిగింపగ ఉరకండోయ్
యిక వర్గపు భేదాలు
పటాపంచలై పోగా
రణదుందుభి విజయ
భేరి మ్రోగించండోయ్
అరుణారుణ కిరణాల
కాంతిబాట తీయండోయ్
తరుణ జీవితాల హృదయ
ఆవేదన మాన్పండోయ్

కదలండోయ్ కదలండోయ్
నరజాతి నగరా పలికిందోయ్!

గో: (ఉద్రేకంగా నినాదం) భూస్వామ్యపు దౌర్జన్యం.
అందరూ: నశించాలి.
విశ్వం: భారతమాత.
అందరూ: జిందాబాద్.

[తెర వాలును]

# నాల్గవ అంకము

౧

[మొదటి సీనులాగే రెడ్డి మేడలో గది. గండడు, పుల్లడు, తాగి టేబిలుపక్క కూర్చుని తూలుతుంటారు. తెర లేవగానే గండడు నిషాతో పాడుతూ లేచి కుర్చీలో కూర్చుంటాడు.]

యెయ్యిరా ! డోసెయ్యిరా
సోకుతో పోజెయ్యిరా
శిలక సుబ్బిని పట్టరా
సింత ఒదిలి బతకరా,

పు: (పైకిలేస్తూ తూల్తూ చప్పట్లుతట్టి) అరే, అరే, ఏం బాగుందిరా పాట —

గం: (మూతిమీసాలు తిప్పుతూ) మరేం, అనుకొన్నావ్ రా? రంగోన్ రాడీ యాసంలో, పెజలు. ఓ...ల్ రైట్ అన్నార్రా నన్నూ.

పు: (వికటంగా నవ్వి) నీ మొఖం!

గం: అరే — జాగరతగా మాట్లాడ్రో.

పు: లేకుంటే, యేందిరా యంగిలికూతలు రొండు నేర్చుకొని, యేశిం, యేశాడట్నే యేశిం!

గం: అరే పిచ్చిధవా, పందికేం తెలుసురా అత్తర్లో వాసనని మనసంగతి సచ్చిన నీ బాబునడిగినా, మోతగా చెప్పేత్తాడ్రా — ఆఁ —

పు: (సోఫాలో కూర్చుని) సరేలేరా గొప్పయాకటేరివి నువ్వు—

గం: (ఆశ్చర్యంగా) ఆరే, అరే రెడ్డి కురిసీలో కూసున్నావ్‌రా, నూత్తే తాటలొలిసేత్తాడు. నీ యిట్టం!

పు: నువ్వుమాత్రం కూసోలేదంట్రా!

గం: (గుండెమీద చెయ్యేసుకోని) మనం గున్నయ్య కురిసీలో కూరుసున్నాం తెలుసా?

పు: (వికటంగా నవ్వి) రెడ్డిగారింట్లో గున్నయ్య కురిసీయేందిరా, నీ మొఖం?

గం: రెడ్డంటే గున్నయ్య, గున్నయ్యంటే రెడ్డి యిప్పుడన్నా తెలుసుకోరా -

పు: కాబట్టేరా! - పాపం సుబ్బారెడ్డి నడ్డకుప్ప నిలువున మనిద్దరం తగలబెడితే రెడ్డి మెచ్చుకోని రొండొందలిత్తె నడుంగులో గున్నయ్య సగం మన మొఖానేశాడు. గున్నయ్యా మణిసేనంట్రా రెడ్డితో జోలిశావ్?___

గం: (కుర్చీలోనుండి పైకిలేస్తూ) సాల్, సాల్ లేరా రెడ్డొచ్చే ఏళైందీ___

పు: (సోఫాలోనుండి లేస్తూ) యేం బాగుండాదిరా కురిసీ సింవాసనం ఉడ్నట్టు.

గం: రెడ్డోరిల్లే సొరగం గదంట్రా అనుకొన్నావేవో?

పు: (పిచ్చిగా నవ్వి) రెడ్డిళ్లు సొరగం, మనిళ్లు సొశాణం___

గం: అరే, రెడ్డిగోరి దయ ఉండబట్టే యీమాత్రం అన్నా బతికుండాం అనుకో!

పు: (నిట్టూర్పుతో) యేం బతకతుండావోఁ పోరా, ఆక

లాకలని మొన్న మా సంటోడు నీళ్ళగ్గూడా దోవలే కుండా సచ్చాడా?–మల్లా యింట్లో ఈపూటగ్గూడా నూకల్లేవా–మనమేమో రెడ్డింట్లో కడుపునిండా తిని, సారాయి తాగినపాళ్ళె సరంట్రా?

గం: యీసారి (ఆదుర్దగా) రెడ్డోరు భలేసాయిం జేత్తాడురా బోలెడంత డబ్బు–ఆఁ–

పు: యేందోరా గండా! నాకు భలేభయం యాత్తుందాదిరా–

గం: యేందిరా పిచ్చినాయాల సుబ్బారెడ్డి, నారయ్యగోడి కూతుర్ని తల లెగరేశావంటే, మనకి కావాల్సినంత డబ్బురా, మనం బతికినంతకాలం, ఆకలి మన దగ్గిరికే రాదు–సుఖంరా, సుఖం. ఆఁ – నీ యిట్టం.

పు: ఆఁ...నీకేంరా పెళ్ళాం పిల్లోళ్ళు లేనోడివి దేనికైనాసరే నంటావ్ –

గం: ఓరే పిచ్చిమొఖం నాయాల నువ్వేసంట్రా నాకన్నా తీసిపోయింది?

పు: (దుఃఖంగా) యింతదాకా యెన్ని గాతకాలు జేశానో, బాగుపడ్డాదేదిరా? అసలు పెళ్ళాం పిల్లోళ్ళని బతికించు కోని బతుకెందుకాంట?

గం: ఐనా నువ్వు జెప్పేదేవనిరా యిప్పుడూ–ఆఁ–

పు: మొన్న మనిద్దర్ని ప్యాణంతో యిడిసిపెట్టాడు ఆ సుబ్బయ్య పెబువు, యీసారి మనం మల్లా ఆపనికే బొయ్యావాఁ మనల్ని ముక్కలు ముక్కలుగా జేశాత్తాడు. ఆఁ– తెలుసా?

గం: ఏం భయింరా – సత్తి అరిచ్చిందురుడాల మాట్లాడు
తుండావ్, నీ సెత్తో యెన్ని పడ్లకుప్పలు తగలెట్టావో
అసలు మన రెడ్డోరి తమ్ముణ్ణి గొంతుపిసికి, బాయిలో
యేసిన సంగతి మరిచిపొయ్యావా వంట్రా,–అన్ని పన్లు
జేసినోడివి సుబ్బారెడికి భయపడ్డావ్ ఏంరా?—

పు: చిన్నరెడ్డిని సంపి, బాయిలో యేసిందాకా రెడ్డొప్పు
కొన్నాడంట్రా, ఆయన్ని సంపించాడు–రెడ్డేమొ వంద
లొంద లెకరాలు వల్లించుకొన్నాడు. నాకేమొ
మూడొందలు చేతులో బెట్టాడు. ఆ కాసుల్రొం
డెత్తుకొనిపొయ్యి డాక్టేరయ్యకే యిచ్చేత్తిని గదరా,
మా సంటోడు కానుపు రచ్చిచ్చిందానికి – ఆ గోడు
తగల్తానే ఉండాదిలేరా నాకు–

గం: గోడేం గోడ్రా పిచ్చినాయాల! మణిసి బతికినన్నిరోజులు
దైరింగా ఉండబళ్లేదంట్రా,

పు: ఏం ధైరింరా – బతికినన్నిరోజులూ. దొంగబతుకు.
మొగోళ్ళైతే కట్టపడి పనిజెయ్యాల, తోగులా
టొత్తే యెదు, రెదురుగా పోరుకాడాలగాని, అట్టా
గాకుండా చాటు చాటుగా బందిపోట్లు పొడవడం
అదొక మొగశిరి పెగ్గేనంట్రా –

గం: (వికటంగా నవ్వి) నీ కెందిరో యియ్యాల్లో తెలివి
తోసుకొచ్చిందో! అసలు, ఆ సంగం వోళ్ళకాడికి
పొయ్యొనావు మారిపొయ్యావురా.

పు: యిరయ్యాలనుంచి నేను తాగన్రా - ఆఁ - నిజమనుకో అబద్ధమనుకో?

గం: ఏందిరే పుల్లా నీ బెట్టో!

పు: పుల్లుగోడి సంగతి తెల్సుగదరా మాటంటే మాటే!

గం: భలే నేర్చేవ్రా, ఆ సంఘంవోళ్ళు నీకు.

పు: పోరా గండా మా సంటోడు సచ్చిపోయ్యినప్పటాల్నించి నామణసెందుకో ఒకరకంగా ఉండాదిరా—

గం: సచ్చినోణ్ని గ్యాపకంజేసుకోని, వచ్చే బహుమానం పోగొట్టుకొంటావంట్రా!

పు: నీకేం తెలుసురా గొడ్డుబోతోడికి, ఆకలాకలని గంజి గూడా దోవలేక సరమెండి సచ్చాడ్రా!

గం: ఐపోయిందానికి నువ్వెందుకురా లోడుకొంటుండావ్?

పు: పోరా అన్నిటికి నువ్వట్నే అంటావ్!

గం: నీకు తెలీదుపోరా, సచ్చినోళ్ళని మరిచిపొయ్యి, బతికినోళ్ళతో పోరకాడి గెలిచేవోడే మణిశిరా - ఆఁ-ఏ వఁనుకొన్నావో గాని?

[రెడ్డి దగ్గుతూ రుమాల్‌తో చెయ్యి తుడుసుకొంటూ ప్రవేశం. గండడూ, పుల్లడూ చేతులుకట్టుకొని వినయం జూపుతుంటారు.]

వెం: పిరికిపందలు ఆ సంఘంవాళ్ళను నడివీఁకి తెగెయ్యలేక మల్లా యేమొఖం పెట్టుకోనొచ్చాట్రా?

గం: (భయంగా) యీసారి సూస్తారుగా అయ్యా.

వెం: (సోఫాలో కూర్చుని) సూడాల్సిందే మీబోటి సప్పిడెధవల్ని.

పు: (నిర్భయంగా) సుబ్బారెడ్డోళ్ళు భలే జాగర్తగా ఉండా రయ్యాగోరూ, మమ్మల్నించికాదు యికన-ఆ(

వెం: (కోపంగా బల్లగుద్ది) వందల కొందలు తీసుకొంటా రంట్రా-మీ చేతగాక వాళ్లెవుకో జాగ్రత్తగా ఉండా రంట దొంగముండాకొడకల్లారా—

గం: (వణుకుతూ) యీసారి తేల్చుకోనొచ్చాత్తామయ్య గోరూ, వాళ్ళని ప్యాణాల్తో పెట్టిరాం-ఆ(-

వెం: (క్రూరంగా నవ్వి) పొయ్యేనపని మొగించుకొని, మీరు గూడా ప్రాణాల్తో బయటబడడం గొప్పతనంరా!

గం: అట్నేనయ్యగోరూ!

వెం: ఆ రెండు తలలూ కిందబడ్డాయంటే మీకు మొఖానేను కొన్నంత డబ్బురా, జ్ఞాపకం ఉంచుకోండి!

పు: డబ్బుల్దేందిలే అయ్యా? మేం(వు బజీకి బైటబడాలగాని —

వెం: మీకేమన్నా అపాయం జరిగితే మేము సూస్తూ ఊర కొంటావ(ట్రా, తగిన సహాయం జేస్తాంగా!

పు: నాకు బోలెడుమంది పిల్లోళ్ళు నా ప్యాణం వాళ్ల చేతుల్లో బొయ్యేనాయంటే, పిల్లా జల్లా గోడుగోడుమంటూ అడుక్కొ(-ని తినాల్సిందేగదయ్యా?

వెం: అంతపనీ జరిగితే మీ పిల్లా జల్లా అడుక్కొ(-తినాల్సిన పనేంరా? మన సంస్థానంలో పాసిపని జేసుకొన్నా కడుపు నిండదూ?

గం: (అణకువతో) అంతా మీ దయే, మీ సలవే గదయ్యా మాబోటోళ్ళకి—

వెం: (గర్వంగా) అందుకే గదంట్రా మిమ్మల్ని కాపాడుతా రావడానికి కారణం.

గం: అంతేగదయ్యా మరి—

వెం: (ఆత్మశ్లాగన) పేదోళ్ళకు మన ఆదరణే లేకుంటే నల్లులు మాడినట్టు మాడ్రంట్రా—

గం: యీ చుట్టుపక్కల గేమాలోళ్ళకి, మన సవస్థానమే లేకుంటే, ఏంవైనా ఐపోరంటయ్యిగోరూ ?

వెం: ఆ విషయం, మీరే తెలుసుకోండ్రా, వయోజన ఓటు హక్కుతో మత్తుబట్టున్న మీరు, యెవ్వరివల్లా బతక తుండారో కళ్లు తెరవండ్రా!

గం: తిన్నాయిల్లు మరిస్తే కూడు పుడదంటయ్యిగోరూ—

వెం: అవున్రా, తిన్నాయిల్లు మరిచిపో లేదు గనుకనే—మాదగ్గర మీకు చోటుదొరికింది—ఏవంటారు?

గం: అవునుగదయ్యగోరూ, మరి మాబోటోళ్ల కి మీరు తండ్రులంటోళ్లు మమ్మల్నేంజేసినా మీ దయే—

వెం: అందుకే్రనా—మా కళ్ళముందర జరిగే తలబిరుసుతనాన్ని రూపుమాపాలంటుండేది.

గం: మీ మాటంటే యగటాయించేవాళ్ళ సంగతి సూత్తాం. యికన నాయాళ్లు, ఎక్కడికి తప్పించుకొంటారయ్యి గోరూ ?

పు: (కోపంగా గండడ్ని ఉద్దేశించి) హుఁ...యీ గ్యామంలో అన్యాయం జేసేవాళ్ళకి పాపం పండింది లే—

గం: కాకుంటే రెడిగోర్తోనే యిరోధాలు ఒకొక్క నాయాలుకి.

వెం: ఐనా అడుక్కునితినే యధవలంతా వీరుడైపొయ్యార్రా గ్రామంలో.

గం: యీరులే, యీసారి సొరగంలో కలత్తారు యీనులు—

పు: (అర్థయుక్తంగా) అరేరేరే దురమారగం జేసేవోళ్ళని సొరగం గాదురా, నరకం అను—

గం: ఔనౌనుగ్నో పొద్దులేత్తె రెడ్డిగోరి భూమిలో తిరిగే వోళ్లు అయ్యిగోర్తోనే యిరోధం పెట్టుకొంటే నరకం కాక సొరగం వత్తదా?

వెం: నీతిమాలిన గాడిదలకు ఆమాత్రం జ్ఞానముంటే యింకేంరా!

గం: మారాజులు చల్లనోరు. మీ దయేగదంటయ్యిగోరూ అసలు మా పాళింలోవాళ్ళని మీరు రచ్చించకపోతే, కుక్కలు చచ్చినట్టు చావరాంట!

వెం: (కోపంగా) ఎలక్షన్లలో మీ పాళిపోళ్ళ మొఖాన మూడువేలు దారబోశాన్రా. కానీ యీనాడు నాకే యెదురుతిరిగాడు లోభిముండాకొడుకులు!

గం: అంతా ఆ సుబ్బారెడ్డోరి బోదనేనయ్యిగోరూ—

పు: (గండడ్ని యీర్ష్యగాసూస్తూ) సుబ్బారెడ్డోర్నించే కాదులే అయ్యిగోరా? అసలు, మా పాళింలో యెవురిపాటి కోళ్ళే మారిపొయ్యారో—

వెం: (బల్ల గుద్ది) మారిపోకేంగా కడుపు కరువుతో మాడే రోజు మా కాళ్ళ కిందకి రాకుండాబోరులేరా.

గం: ఆ సుబ్బారెడ్డోళ్ళు యేంవో దోశపెడతారని ఆశిబెట్టుకోనుండారు ఆ రాశిమూ బైటబడదంటయ్యగోరూ?

వెం: (కాలు కింద రాస్తూ) అవున్రా పెడతారు పెట్టకేం, వాడ్ని నమ్మినోడికంతా ఒక బొచ్చి చేతికిచ్చి వాడబ్బసొమ్ము బోంచెయ్యడానికి పెడ్తార్రా!

గం: అంతేగదంటయ్యగోరూ! అసలు ఆయనకి తింటానికుంటే గదా ఆ యెట్టినాయాళ్ళకి పెట్టడానికాంట!

పు: (ఈర్ష్యగా) యెవ్వరైనా మాటలుజెప్పేవోళ్ళేగాని ఒకపూట గెంజి తేరకిబోసేవోళ్ళు లేరు యీ కాలంలో—

గం: అంతేగనంట్రా రెడ్డోరింట్లోగాదు ఆకలిగున్నోళ్ళంతా యెగేసుకోనొచ్చి తెగదినిపోవడానికి. యికన తెలీదంట్రా ఆ యీరులు బతుకా!

వెం: వినాశకాలం దాపురిస్తే విపరీతబుద్ధులు పుట్టుకొస్తాయని, ఆకటితో సచ్చే నుండాకొడుకులుకంతా స్వాతంత్ర్య భావాలట. బోళబాటు యిక నూస్తాగా!

గం: ఇనాశినానికే గదంటయ్యగోరూ మీతో యీ గ్యామమోళ్ళు యిరోధం పెట్టుకోవడం!

పు: (క్రోధంగా రెడ్డివంక జూస్తూ) అంతేగదంట్రా యినాశనానికే గదా యీపన్నంతా?

గం: ఐనా రెడ్డిగారోనే పగబెట్టుకొంటే వాళ్ళు నెగ్గతారంట్రా! (గున్నయ్య భయం ప్రకటిస్తూ వేగంగా ప్రవేశం)

వెం: ఏం గున్నయ్యా! భలే గాబరాగా వచ్చావే, పొయ్యిన పని కాలేదేం.

గు: పని సమాచారం అలా ఉంచండి వాళ్లు దండెత్తి మన మీాదకు రావాలని నిర్ణయించుకొన్నారట!

వెం: ఎవరయ్యా, వాళ్లు....కూర్చో (కుర్చీ జూపుతాడు).

గు: స్థిమితం తర్వాత లేండి, ఆ సుబ్బారెడ్డి కొడుకు కొంత మందిని పోగేసుకొని మనమీాదకు రావడానికి సన్నాహాలు జరుపుతుండాడు.

వెం: (కోపంతో ఉద్రేకుడై సోఫాలోనుండి లేచి) రానీ— రానీవయ్యా ఒక్క నిమిషంలో తేలిపోతుంది అసలు విషయం!

గం: (గున్నయ్య నుద్దేశించి) యిక్కడి కొచ్చారంటే నాయాళ్ల తలకాయిలు రామకీర్తం, పాడించవాంట?

గు: (గాబరాగా) ఒకరా యిద్దరా మన మెదిరించడానికి.

గం: (మీాసంమీాద చెయ్యివేసి) ఎంతమందినైనా సరే ప్రాణంతో పెడతావాఁట?

గు: (నిరాశగా) ఏఁవిటో మీాశౌర్యం! మొన్న తీసినప్రాణం కొరవాసరవా తియ్యాల్సిందే.

గం: మొన్నగాదుసావేఁ తప్పిపోడానికే యియ్యాలగదా సంగతి తెలిసేదాంట !—

పు: (ఈర్ష్యగా నవ్వి) ఓ....అసలు సంగతి యియ్యాల్నే తేలిపోతాదిలే.

గం: (సంతోషంగా) మరేం, అనుకోన్నాపురో మన సాహసవేఁ మూలచ్చివి !

వెం: (ఆలోచనగా) కడుపు కాల్నప్పొడు, మమ్మల్నిడిగి పొట్ట నింపుకోడానికి తెలిసినప్పొడు, యీలాంటి సమయాల్లో మీ సాహసం సూపించాల్రా—

గు: (ఉద్రేకంగా) ప్రాణాలు పొయ్యినాసరే తిన్నయింటి పరువు నిల్పాలిరా !

గం: (దీమాగా) మరేం అనుకోన్నావయ్యో, గున్నయ్యో, సూత్తావుగా తడాకా, (మీసం మెలేస్తాడు.)

పు: (హేళనగా) మీసం మెలేసినపాటగాదురా పనిజేస్తేగదా తెలిసేది.

గం: ఒరే, పిరికినాయాల నువ్వెనక్కి తగ్గితే నేను జంకతా ననుకోన్నావంట్రా !

వెం: మా సొమ్ము తిన్నప్పొడు ధైర్యం జూపాలి. నాలుగు డబ్బులు సంపాదించుకోడానికి యిదే తరుణం. బాగా ఆలోచించుకోండి.

గం: దాందేఁదిలే అయ్యిగోరూ, యేదో మీదయుండాలిగాని పత్తుండకుండా తాగమాంట !

గు: యింతవరకూ యెవురి సలవన బ్రతుకుతుండాదో ఆలోచించండిరా!

గం: రెడ్డోరే లేకుంటే మాబతుకు కుక్కసావేగదంట సావే—

వెం: ఐనా, తలగోడితే దమ్మిడీచెయ్యని వెధవల విషయం ఎంతగా, ఆలోచించాల్సొచ్చిందీ?

గం: (ఉత్సాహంగా చిటికేసి) ఏందయ్యోగోరూ, చణంలో ఆ సుబ్బారెడ్డి తలకాయి మీా కాళ్ళముందరుంచనూ. ఏం అనుకున్నారోగాని—

వెం: మంత్రాలతో మామిడికాయలు రాలవురా, మాటల్తో ప్రయోజనంలే పనిజేసి చూపించాలి—

గం: చూత్తారుగా అయ్యోగోరూ గండడి దెబ్బంటే ఎంత ఘనంగా ఉంటదో!

గు: ఆనాడాల యీనాడూ చేతగానితనం జేశారంటే, మీారు ప్రాణాల్తోరారు జాగ్రత్త.

పు: (ఈర్ష్యగా) ఓ...అంతపనీ జరగద్దిలే, యీసారి తప్పేదే లేదు!

గం: ఏందిరో అనట్టపు నాయాల అపశకునం పలకతావ్?

గు: యీపని పూర్తిజేసుకొచ్చారంటే రెడ్డిగారిదయ మీామీాద ఎల్లకాలం ఉంటుంది తెలుసా?

వెం: తగిన ఫలితం ముట్టజెప్పమూ, వాళ్ళకష్టం మనకెందుకూ?

గం: అంతేగదంటయ్యోగోరూ మీా కాళ్ళజోడు యలవ మా బతుకంతా. మీారు చిన్నచూపు మామింద ేసినా చాలు ఎల్లకాలం బతికిపోతాం!

గు: (ఒప్పలేనితనంగా) సరేలేవోయ్ - తినే సొమ్మంతా యెవ్వర్దో, మడులూ మాన్యాలు కావాల్నేం?—

గం: మా కెందుకులే సావేఁ, మడులు మానాలూ, తినడాని కుంటే చాలుగానే-

వెం: అప్పన్నా మీరు కష్టపడి పని మొగించారంటే కావాల్సి నంత తిండి!

గం: ఏదో మీదయలే జయ్యిగోరూ!

గు: యీ రోజుల్లో కడుపుకు కూడు దొరకడం, ఎంతో పుణ్యం జేసుకొన్నట్టని తెలుసుకోండి. జాగ్రత్తగా ఆలోచించి కార్యం మొగించండి - ఆఁ—

పు: (నిర్భయంగా) యిప్పటిదాకా ఎట్టాంటిపన్లు జేశానో కడుపునిండా తిన్నారోజులా. సావేఁవో కడుపునిండా కూడేనని చెప్పేత్తాఉండాడు—

గు: ఓరే-పిచ్చిముండాకొడకా, ఒక్కసారి సాహసంజేస్తే కల్పవృక్షం వస్తుందన్రటా, యెప్పుడూ బ్రతకడానికీ. యేనాటికానాడు కష్టంజేస్తే కూడు. ఆ సుబ్బారెడ్డిని తలెగరేశారంటే, తగిన బహుమానం లభిస్తుంది - తెలుసా?

వెం: యింతవరకూ మీ కాపురాలకు దీపంబెట్టిందెవ్వరో తెలుసుకోండిరా?

గు: అసలు గ్రామం అంతా ఎవ్వరి సలవన బ్రతకతుందో ఆలోచించండి?

వెం: ఆ సుబ్బారెడ్డి తల తెచ్చారంటే చెరి వెయ్యి రూపా
యిలు ముట్టజెప్తాతా అం——

గు: (గుండెలు తట్టుకొంటూ) అమ్మో—రెండు వేల రూపాయిలే,
భలే లాట్ కొట్టేశారా——

వెం: (గున్నయ్య నుద్దేశించి) మరేం, అనుకొన్నావయ్యా!
ఆమాత్రం వాళ్ల కష్టం మనం కనిపెట్టకుంటే యెలాగు
మరి——

గు: చూడండిరా చూడండి రెడ్డిగారు మీామీాదెంతదయో,
అసలు ఆయనగారి గుణమే ఏరు!

గం: హుఁ.... అయ్యగోరు చల్లంగుండాల్నేగాని మనకేం
కొరవయ్యా!

పు: (లేనుత్సాహం తెచ్చుకొని) అసలు మన కడుపులు చల్ల
బడ్డట్టేగా!

వెం: (డ్రాయర్లో రివాల్వరుతీసి చేతబట్టుకొని) దీంతో ఆ
సుబ్బారెడ్డిని—వాడి వంశాన్ని ధ్వంసంజేసి నా పగ
తీర్చండి——

పు: (ఆశ్చర్యం జూపుతూ) అమ్మో తుపాకే!

వెం: ఎందుకంట్రా అంత భయం దూరంగా నిల్చుకొని గురి
బెట్టి ధనా, ధనామని కాల్చారంటే చాలు. నల్లులు
సచ్చినట్టు మాడిసస్తారు!

గు: ఆ సుబ్బారెడ్డి నొక్కణ్ణి నాశనంజేస్తే చాలు గ్రామం
కుదటబడుతుంది.

వెం: (ఉద్రేకంగా కాలు కిందరాస్తూ) వాళ్లొక్కళ్ళే ఏంటి నీ పిచ్చి - వాడి వంశం నామరూపాలు లేకుండా జేయాలి—

గం: యీ టుపాకితో కాల్చేశిరమ్మంటారా అయ్యగోరూ—

గు: (గండడ్ని ఉద్దేశించి) మనిషంటే ధైర్యం ఉండాల్రా!

పు: (అర్థయుక్తంగా) ఆ కూటికిలేనోళ్ళని సంపేదానికి దైరిం దేనికిలే సావేఁ!

వెం: ఆ కూటికిలేనోళ్ళే జూడ్రా ఎంత కథ నడుపుతుంటారో! ఆ అంకారవు గాడిదల్ను కాల్చిపారేస్తే పీడ విరగడై పోతుందిగా!

గం: యీ దెబ్బతో నాయాళ్ళని వరసబెట్టి కొంగల్ని కాల్చినట్టు కాల్చేసి రానాంట్ట!

వెం: మీ రెంతపనిజేసినా నాపేరు బైటికిరానివ్వగూడదు మీ యిష్టం.

గు: అసలు మీరు జేసేకార్యాలు రెడ్డికి తెలీదన్నట్టుగానే నటించాల ఆఁ—ఏంవఁటారు?

పు: మా ప్యాణాలమీద కొచ్చిందంటే తప్పించేదెవురు సావేఁ!

వెం: అరే—మీకేం భయంలేదు మీపని మీరు గానివ్వండి పై అధికారుల్తో నేను మాట్లాడతాగా—

గు: ఓరే—తెలివితక్కువ పెద్దమ్మలారా, రెడ్డిగారికి గవర్నమెంటులో ఎంత పలుకుబడుందో, అక్షరంముక్కరాని మీబోటి ఎధవల కేం తెలుస్తుందిరా?

వెం: మీ ప్రాణాలకేం భయంలే. నేనున్నానుగా కానివ్వండి!

గు: రెడ్డిగారే మీకు ఇంతగా అండబలక తావుంటే యిక నేటి కంట్రా మీ ఆలోచన–

పు: ఎన్నిసార్లో నేను మీవల్లా జైలికిపొయ్యింది లెక్కేలే దయ్యగోరూ, ఒకసారన్నా తప్పిపొయ్యిందిలే, యీ తేప ఉరెశిచ్చే గతి–

వెం: ఎన్నిసార్లు జైలికెల్లినా మీకేంరా, మీకు ఆస్థులా, గౌరవాలా? మాపని మొగిశిందంటే తగిన ఫలితం ముట్టజెపుతూనే ఉన్నాంగా!

గ: మీ పిల్లా జల్లా బతకడానికి ఆమాత్రం ఆధారం చాల దటోయ్!

గం: మాబోటి దరిద్రపోళ్ళ పాలిటికి, రెడ్డంటి ధర్మప్రెబువులు లేకుండాఉంటే సచ్చిపోమంట గున్న య్యగోరూ.

వెం: (కోపంగా) అరె–మా గ్రామంలో బతకాలంటే, పని పూర్తి జేసుకురాండి. లేకుంటే, పోలీసు లాకప్పులో పెట్టిస్తా ఆలోచించండి–

పు: (దీనంగా) యిప్పుడు మేం యేమితప్పు జేశావని జైలి కెయిత్తారయ్యగోరూ?

గు: ఒరే–అమాయకపు వెధవా, రెడ్డిగారిమాట ఎగటా యించడవేంరా!

గం: ఆఁ.... రెడ్డోరిమాట కాదని, పగజేసుకొని బతకడానికే నంట సావే! అట్టాంటిపని మాప్రాణంతో జేత్తావా–

వెం: (గండడ్ని పుల్లణ్ని సమీపించి) అరే నా సంగతి మీకు తెలుసుగదూ? ఆ సుబ్బారెడ్డిగోడి వంశాన్ని, ఆ నారయ్య కూతుర్ని సఫా జెయ్యకుండా వచ్చారా, మిమ్మల్ని నిలవనా కాల్చేస్తా–ఆఁ–

గం } : (వణికిపోతూ) ఏంవైనా జేత్తాం వయ్యగోరూ మీ
పు }

యిట్టప్రకారం–

గు: చెయ్యకుంటే యెలాగురా యింతకుమునుపు మీరు జేసిన పన్లకి పోలీసు కేసు పెట్టించి మీ దుంపదెంచదూ, అనుకొన్నారేవోఁ–

పు: (ధైర్యంగా) రెడ్డిగోరు చెప్పి తేనే గదంట సామే, మేవుఁ జేసిందా లేకుంటే, మా కట్టానికిబోద్దా మాకు బోద్దా!

వెం: కష్టం, అంట్నే కష్టం. యీ గ్రామంలో, ఎవ్వరికి భూము లుండిరా పన్లుజేయడానికీ? సచ్చినా బతికినా, పొద్దు ల్నేస్తే, మా భూముల్లో కష్టంజెయ్యాలి. తెలిసిందా అలాంటప్పుడు మేం జెప్పిన పన్లు చెయ్యకుంటే మీ రెందుకురా–

గు: మా తాతలు, వాళ్ళ వాళ్ళ తాతలు రెడ్డిగారి సంస్థానంలో చాకిరిజేసి మెప్పుబొందినోళ్ళురా, పిచ్చి కుంకల్లారా!

వెం: (కోపంగా) మీరు తప్పకుండా యీపని జేసుకోరావాలి–ఆఁ–కదలండి!

గం: చిత్తం.

పు: (వణికిపోతూ) మానల్లా ఐతే చేసికొత్తాం అయ్యగోరూ_

వెం: వాళ్ళ ప్రాణాలు తీసుకొచ్చారా సరే, సరి లేకుంటే (రివాల్వరు పైకెత్తి) దీంతో మీ రక్తాన్ని కళ్ళ జూస్తా, బాగా ఆలోచించుకోండి___

గు: (గండడ్ని పుల్లణ్ని ఉద్దేశించి) కానివ్వండిరా-సరేననండి రెడ్డిగారిని ఉద్రేకపర్చారంటే మీ ప్రాణాలకే ముప్పు తెలుసా ?

గం: (ఆవేశంగా పుల్లడువైపు చెయ్యిజూపి) నే నేమో తయారుగాఉంటే_పుల్లుగాడు ఎనక్కి తగ్గతుండాడు సాఁమే-

పు: (నిర్భయంగా) ఏందో సావేఁ - నాకు బలే భయిమేత్తా ఉండాదా___

వెం: (ఉద్రేకుడై పుల్లడ్ని సమీపించి) వఁూఁ....దొంగలంజాకొడకా, భయంగా ఉందట్రా_మా సొమ్ము వంద లొందల రూపాయి లెత్తుకొనిపోవడానికి భయంలేదేం-యిప్పుడొచ్చిందంట్రా భయం !

పు: (దుఃఖంగా) వందలొందలు డబ్బు మా దెగ్గిరుంటే దిన పత్తు లెందుకు సత్తామయ్యగోరూ?

గు: యింతకముసుపు రెడ్డిగారిదగ్గర నే నిప్పించిన డబ్బంతా ఏం జేశావు గనుకనోయ్ పస్తులుండడానికీ?___

పు: (కృంగిపోతూ) అదంతా లోడుకోవడం దేనికిలే సావేఁ ! ఆ గాతకం తగల్తానే ఉంది___

వెం: ఏఁవిట్రా ఘాతకం_నీ మొఖం_

గు: అబ్బో-ఏంట్రా నీ ద్యోరణే?_

వెం: ఆఁ....వీడి ధోరణింటే వీడికీ ఆ సంఘం పైత్యం ఎక్కి-
నట్టుంది!

గు: ఆ, ఆ. ఏం లోటులే-తప్పకుండా అంతే-

గం: (రెడ్డినుద్దేశించి) అవునయ్యొగోరూ! ఆ సంగంవాళ్ళ
కాడికి పొయ్యొనప్పట్నుండి మారేపొయ్యాడు-ఆఁ!

గు: (గుండెలు కొట్టుకొంటూ) ఓరే అప్రాశ్చపు ముండా
కొడకా, మా గుట్టంతా రచ్చకెక్కించే వుంటావురా-
ఎంతపని జేశావురా?-

వెం: (ఉద్రేకుడై పుల్లణ్ని సమీపించి) ఆ సంఘంవాళ్ళతో
ఏం జెప్పావో చెప్పు. చెప్పకుంటే నిన్ను కాల్చి
పారేస్తా-ఊఁ!

పు: (భోరునేడ్చి) నేనేం పాపం యరగనయ్యొగోరూ, నా
బిడ్డలు సాచ్చిగా, నే నోళ్ళతో, ఏం జెప్పలేదయ్యా!

వెం: జెప్పకపోతే - యేనాడూ లేని భయం, యిప్పు డెందు
కొచ్చిందిరా? యేలాంటి హత్యలైనా నిమిషంలో
జేసేవాడివి, యీనాడింత పిరికితనం రావడానికి
కారణం జెప్పవేఁవిరా?-

పు: యింతకుముందు జేసిన దోహావుపన్లు యికన జెయ్యొనయ్యొ
గోరో బుద్దొచ్చింది!-

గం: యికన నాతో కలవనని, పట్టుపట్టుండాడయ్యొగోరూ -
మూారకపు నాయాలో!-

గు: ఆ సంఘం చీడపురుగుల్తోచే_ర్తే మల్లా మూార్ఖం వదలడం
గూడా జరగద్దంట్రా?-

వెం: మూ_ర్ఖం, యీాడి తాతలాంటోళ్ళు మూర్ఖం, వదు
ల్తారు, యీాడీదేంది వుండాకోర్ది-

గు: రెడ్డిగార్తో కలిసీ మెలిసీ, ఆ సంఘంవాళ్ళతో జేరి సామి
ద్రోహం జేస్తున్నావ్, గదరా!

వెం: ఏంరా దొంగరాస్కెల్ వాళ్ళతో అన్నీ రహాశ్యాలు
జెప్పావ్ గమా చెప్పు-

పు: (వణికిపోతూ) నే నెరగనయ్యోగోరూ, సామిసాచ్చిగా!

గు: ఆ గాలి తోలకనే ఉండాలిగాని, తోలినాక యివాళ
కాకపోతే రేపైనా జెప్పవూ?-

వెం: ఊఁ-చెప్పరా (పుల్లడ్ని సమీాపిస్తూ) మా రహాశ్యాలు
ఏం జెప్పావో చెప్పు, నిన్నిడిపిస్తే, యిక నెంతపనైనా
జేస్తావ్—

గు: అమ్మో_అంతేగదూ మరి.

పు: యిక నోళ్ళతో కలవనయ్యోగోరూ (దీనంగా) నన్ను యిడిసి
పెట్టెయ్యండి కట్టం జేసుకోని బతకతానయ్యో!

వెం: నిన్నిడిపిస్తే ఎట్లాగురా, మాపరువూ ప్రతిష్టా, నీచేతుల్లో
చిక్కిపోయ్యేనాయ్ _ మా కళ్ళముందరనుండి నిన్ను
తొలిగించుకోవాలిరా!—

గం: (గున్నయ్య నుద్దేశించి) యికన రెడ్డోరి కొలువే జెయ్య
నని, మొండిపట్టు పట్టుండాడు గున్నయ్యోగోరూ!—

గు: ఎట్టా _ అంతవరకూ వచ్చిందా కథ!

వెం: రాకేం-వీడ్ని ప్రాణాల్తో విడిపించావంటే ఎంతవరకైన
వదుస్తుంది కథ—

గు: రాను రాను పద్ధతులే అడ్డం తిరుగుతున్నాయండీ !

వెం: మన చాతగాని తనమే పరిస్థితులు అడ్డం తిరగడానికి కారణం తెలుసా?

పు: మీావల్లా జతికేవోణ్ని-మీా రాశాలు వాళ్ళతో జెప్పి, మీాకు దోహం జేత్తానా అయ్యగోరూ?——

వెం: దొంగమాదర్చోద్-యిప్పుడు చేశింది సాలకంట్రా యిక జైనని వాగ్దానం జేస్తుండావ్ !

గు: వేషం యేశినా అలాగుండాలి. యెత్తుకు పై యెత్తు.

పు: ఏంటయ్యగోరూ? నన్ను యిట్టా అనుమానిత్తాఉండారే నన్నొదిలెయ్యండి సావేఁ దండంబెడతా (దండం బెడతాడు).

వెం: నీ దొంగదండాలకు జాలిపడేవాణ్నిగాదురా నేను. తెలుసుగదూ?

గం: నోటికాడ కూడు తీసుకొనేదానికి యీాడి కీబుద్ధులు పుట్టాయిలే అయ్యా!

గు: (పుల్లగ్నుద్దేశించి) యీా సంస్థానంలో గాదురా, ఆటే పొట్టబోసుకోడానికీ యికన గదంట్రా నీబతుకు తెలిసేదీ!

గం: ఐనా రెడ్డోరితోనే యెదురేజ్జం యేసుకొంటే ఏంవఁని?

వెం: ఎదురేజ్జాలేసుకో కేంరా! మా సొమ్ము తిన్నావాడికి కొవ్వుపడుతుందిగా!

పు: నేనేం తప్పు జేశానయ్యగోరూ, నామీాంద ఎందుకం డయ్యా అంత కశి?

గు: ఆ సంఘంవాళ్ళతో కలవడవేఁరా నీకు వినాశనం!

వెం: నేను జెప్పినపని జేయడానికి బాదులు, అడ్డంకులు జెప్పడం, ఏఁవన్రా నీ ఉద్దేశం?

గం: యీడుగాని యనక్కి తగ్గకుండుంటే సుబ్బారెడ్డి తలకాయిని నిమిసంలో ఎగరేసుకొని రానంటయ్యిగోరూ!

గు: మీ రెంతతొరగా పనిజేసుకొస్తే అంత మంచిది, తగిన ఫలితం తప్పక లభిస్తుంది. ఆఁ—

పు: (చేతులెత్తి దండంబెట్టి) నాకేం ఫలితమూ వొద్దు, నా బతుకు నన్ను బతకనియ్యండి సావేఁ!

వెం: ఆఁ....యింతదాకా మా సొమ్ము ఏనుగుదిన్నట్టు తిని యిప్పుడుడాయిద్దాం అనుకొన్నావంట్రా?

గు: ఆ సుబ్బారెడ్డిగాడు వీడికి బాగా బోధజేశాడు___

గం: సుబ్బారెడ్డేగాదు సావేఁ! ఆ సంఘపోళ్ళంతా!

వెం: (వికటంగా నవ్వి) యిక్కణ్నించి నిన్నిడిపిస్తే మాబతుకు బజారు కెక్కిస్తావంట్రా!

పు: (వణికిపోతూ) లేదయ్యిగోరూ! లేదు అట్టాంటిపని జేత్తే కూడు బుడద్దంట సావేఁ?

గు: కరువు దినాలల్లో నీ పిల్లా జల్లా కడుపునింపుకొని రెడ్డిగారికి పనిబడేటప్పటికి, పంగనామాలుదీసి, ఆ సంఘంవాళ్ళతో కలద్దావఁనుకోన్నావంట్రా?

పు: (ధైర్యంగా) పిల్లా జల్లా తినబట్టేనా సావేఁ? గెంజినీళ్ళకే కరువై మా సంటోడు నిలవనా సచ్చాడు, యిప్పుడు

నా గుడిశిలోకిబొయ్యి చూచుకో, భారియా పిల్లోళ్ళు అల్లో రామచందరా అంటూ ఆకల్తో సచ్చిపోతుం డారో లేదో ?

గు: ఓరే, తిక్కముండాకొడకా, నీ భార్యా పిల్లలు వస్తులు సావాల్సినంత అగసాట్లేవిరా? రెడ్డిగారు బత్తిమియ్య నన్నాడంట్రా !

పు: ఏం వద్దులే సావేఁ—అత్తిపనులుజేసి పొట్టబోసుకోని బతికే బదులు, యిసందాగి సచ్చిపోతాంగాని !

గు: రెడ్డిగారిదగ్గర్నే ఏంట్రో నీ తలతిరుగుడు మాటా !

వెం: (పుల్లడ్ని సమీపించి జుట్టుపట్టుకోని గట్టిగాఊపి) ఏంరా? అత్తిపన్లట్రా గాడిద కొడకా జాగ్రత్త కాల్చిపారేస్తా జాస్తివాగావంటే !

పు: కాల్చేయిండయ్యి గోరూ ! చేసిన పాపానికి తగ్గా సావే సత్తాగాని –

గు: అందుకూ శిద్ధమయ్యావంట్రా, సామార్థవు ముండా కొడకా !

వెం: నిన్ను మాటల్తో ప్రాణాలుతీస్తే యెలాగురా, చిత్రవధ జేస్తేగాని నా మనస్సు తృప్తి పడదు. ఆఁ –

పు: (ఆవేశంతో రెచ్చిపొయ్యి) అడన్లే అయ్యిగోరూ, మమ్మల్ని మీరూ, మిమ్మల్ని దేవుడూ, చిత్తరవద యట్టా జరగద్ది, తప్పించుకోలేములే –

గు: (ఆశ్చర్యంగా) ఆఁ – ఆఁ – రెడ్డిగారితోనే మాటకు మాటంట్రా. ఏఁ గుండెలు దీసిన బంటువురా? –

గం: ఏఁదరే పుల్లా – నీ మొండిధైరిమూ నువ్వూనూ?

వెం: (హుంకరిస్తూ పైకి) ఏంటిరా, మల్లాయ్. దేవుడు మమ్మల్ని చిత్రవధ జేస్తాడా?–ఆఁ–జెప్పరా పొగురు బోతు ముండాకొడకా!

గం: (వినయంగా) చాతగాన్నాయాలులే అయ్యగోరూ, వోణ్ణి చమించండి. మీారు జెప్పినపని చాత్తాడులే అయ్యా!

పు: (గండణ్ణి ఉద్దేశించి కోపంగా) యిక నువ్వేజై కూనీలూ, దొంగతనాలూనూ. యీా చణంనుంచి నా పేరె త్తావా నీకు పొరుఉండదురో! ఆఁ–

గు: (ఆర్భాటంగా) నిన్నెవురు జైమన్నార్రా దొంగతనాలు?

పు: (నిర్భయంగా) హుఁ....యియ్యాల మీారు జెప్పేది కూనీ జైమనేలే. అప్పుడంతా దొంగతనాలుజేశి పేదోళ్ళ ప్యాణాలు తీశి, దోచుకోనొచ్చిన సొమ్మంతా రెడ్డోరు, నువ్వు పంచుకోలే యరగనట్టు...

వెం: (చెంప గిర్రుమనేట్టుకొట్టి) జాగ్రత్త. ఏం చూాజుకొన్నా నీకీ కారుపొగురూ?___

పు: (ఆవేశంగా) అవున్లే అయ్యగోరూ! ఆస్తికోసమని, ఆయాల చిన్నరెడ్డిగోర్ని, ధర్మపెబువుని గొంతు నులి పించి బాయిలో యెయ్యించారు. యియ్యాలేమో ఆ సంఘంవాళ్ళ గొంతులు నరకమంటుండారు. యంత సాగితేమటుకూ...

గం: (భయంతో వణికిపోతూ) ఏందిరే – ఆ మాట్లో రెడ్డో రెదచ్చే —

గు: (గుండెలు కొట్టుకొంటూ) అమ్మో – అమ్మో –

వెం: (పిచ్చిగా) ఆఁ...ఏం కూశావ్? నా రహస్యం బైట బెట్టేశావంట్రా, నిన్నేంజేస్తానో చూడు (మీది కురుకుతూ) నిన్ను నిలవనా కాల్చిపారేసి, నా రహస్యాన్ని దాచుకొంటా!

గు: (రెడ్డి నడ్డుపెట్టి) ఆగండి, ఆగండి –

వెం: (పిచ్చిగా) ఆఁ – ఏంటయ్యా ఆగేది. వీణ్ని ప్రాణంతో యిడిపిస్తే మన రహస్యాలు ప్రపంచానికి తెలస్తాయి, మనల్ని సంఘంలో రాక్షసులని లెక్కగడతారు. తెలుసా?

పు: మీరు జేసేపన్లు యెప్పుడైనా తెలత్తాయిలే సావేఁ –

వెం: (రౌద్రంతో పైకి దూకుతూ) ఓరేనా! నువ్వు బతికుంటే ఏనాటికైనా బైటపడతాయి. అందుకని నిన్ను చంపి ఒక చింత తీర్చుకొంటా!

పు: (ధైర్యంగా ముందంజవేశి) ఇన్నిరోజుల్దాకా నా కాశలు బెట్టి నాచేత దొంగతనాలు చెయ్యించి, కూనీలు జరిపించి, పేదోళ్ళని దోచుకొని రమ్మన్నారు. పశువునాల మీరు జెప్పిన అన్నిపన్లు జేశా. పెపంచాన్ని దోశి మిమ్మల్ని మారాజుల్ని జేశా. అట్టాంటి నిజాయితీ లేని రాచ్చిసోణ్ణి నేను. ఆఁ– కాల్చేయిండి!–

గం: (భయంతో వణికిపోతూ) రెడ్డిగోరికి కోపం తెప్పించ బాకురా, రావిఁగోణ్ణి కాల్చేశినట్టు కాల్చేత్తాడో, పిచ్చినాయాల –

పు: అధికారం చల్లతావుందని, యంతమంది పేదోళ్ళని అత్తి బెట్టాడో, రావిఁగోడి పెళ్ళాం గావాలని వోణ్ని నిలవనా కాల్చేశాడా! – నన్ను కాల్చెయ్యనీరా.

గు: అరే! అట్టే వాగకురా, నోరుముయ్యిరా –

వెం: (పుల్లడికి రివాల్వారు గురిపెట్టి) ఆఁ–ఏం కూశావ్ రా? యిక తప్పించుకోలేవు నీ చావు. జాగ్రత్త!

గం: (భయంతో) యీడికి యియ్యాల మూడింది గున్నయ్య గోరూ? –

గు: అంతపనీ యీరోజు జరిగేతీరుతుంది. ఆఁ–తప్పదు.

వెం: (కడుపుకు తగిలేట్టు రెండుగుండ్లు పేల్చాడు) చావు ఆంకారపు గాడిద!

గు: (కళ్లు మూసుకొని) రామ–రామ!

గం: (ఆందోళనగా) అమ్మో! చచ్చావురా – పుల్లా!

పు: (కడుపులోనుండి కారుతున్న రక్తాన్ని ఆపుకొంటూ) అబ్బా- అమ్మా –

గం: (పుల్లణ్ని ఉద్దేశించి) నీ మూరకవేఁ యింతపని జేశిందిరా –

గు: ఏఁవిటో యీ పరిస్థితులు ఆ దేవుడికే తెలియాలి –

వెం: (వికటంగా నవ్వి) తెలిసిందట్రో మన తడాకా?

పు: (పొంగొస్తున్న రక్తాన్ని ఆపుకొంటూ, బాధతో) మంచి పనే జరిగింది. చచ్చేటప్పుడన్నా నీతిగా ఉండాలని బుద్ధిపుట్టింది. అంతే చాలు - (రెడ్డిను దేశించి) రెడ్డి గోరూ నువ్వుగూడా చచ్చిపొయ్యేటప్పుడు, యెవ్వ రికీ అన్యాయం జెయ్యివని, నీతోటి కూనీకోరు పేరి దించుకొంటుండాడు - (స్పృహతప్పి కిందబడతాడు)

వెం: సచ్చే క్షణంలోగూడా నీకీ పొగురు తగ్గలేదంట్రా?

గు: (లేనుత్సాహంతో) చింతసచ్చినా పులుసెక్కడికి సస్తుంది లేండి!

వెం: (వికటంగా నవ్వి) యీ గ్రామంలో నన్నెదిరించిన వాళ్ళ గతంతా యింతే!

గు: ఆ-హ్హా-అంతేగా మరి.

గం: (పశ్చాత్తాపంగా) చచ్చిపోయినట్టేఉంది పాపం బోలెడు మంది పిల్లొళ్ళుగల్లావాడు -

గు: రివాల్వారు దెబ్బతగిల్తే మల్లా తిరుగుండంట్రా! పైన ఆయువుపట్టున తగిలింది!

వెం: (ధైర్యంగా) లమ్డీకొడుకును రహస్యంగా చెరువులో పారేశిరారా గండా!

గం: (భయాన్ని ప్రకటిస్తూ) నన్నేనా అయ్యిగోరూ?

గు: (కంగారుగా) నిన్నుగాక మరి నన్నంట్రా?

వెం: ఏంరా గండా నీకూ ఆ సంఘుంపిచ్చి పట్టిందంట్రా?

గం: ఏందయ్యగోరో! నన్నుగూడా అనుమానిత్తా ఉండారే. చచ్చినా, బతికినా నా ప్యాణం మీ పాదాలముందర వదలాలిసిందే! అఁ_అనుకొన్నారేవోఁ –

గు: (పొగిడింపుగా) సెభాస్ – నువ్వేసర్రా. అసలు రెడ్డిగారు నీ ధైర్యాన్ని అప్పుడప్పుడూ మెచ్చుకొంటూనే ఉంటాడు. విశ్వాసం అంటే నీదేరా!

గం: మీ దయ. నన్ను బతికించేవోళ్ళు మీరేగదంట స్వాఉఁలూ!

గు: నీకే యిబ్బందొచ్చినా రెడ్డిగార్నడిగి కావాల్సినడబ్బు పుచ్చుకోరా! భయమెందుకూ?

గం: (సంతోషంగా) రెడ్డోర్దయ ఆమాత్రం ఉంటే చాల్లే గున్నయ్యగోరూ!

వెం: మా కనుకూలంగా ఉంటే, మా సహాయం నీకెంతైనా అవసరంరా. జ్ఞాపకముంచుకో –

గం: (చేతులు నలుపుకొంటూ) చిత్తం, చిత్తం!

వెం: (జేబులోనుండి నూరు రూపాయిల నోటు తీసిస్తూ) యిదిగోరా మా సహాయం తీసుకో – ఊఁ.

గు: (నిరాశగా) రెడ్డిగారి దయ, తీసుకోరా, బ – తి – కి – పో_య్యా_వు–పో.

గం: (ఆదుర్దాగా తీసుకొంటూ) పెబువులోరిదయ ?

వెం: పుల్లిగోడు చెరువులోబడి సచ్చాడని ప్రాపగండ జెయ్యిరా!

గు: ఆ సంఘంవోళ్ళే సంపి చెర్లో యేశారని సాటెయ్యిరా పీడ వదిలిపోతుంది!

వెం: (సంతోషంగా) భలే ఆలోచన, తెలివి మీా సొత్తే. (జోబులో డబ్బుతీసిస్తూ) ఖర్చుల కుంచిపెట్టండి.

గు: (డబ్బుతీసుకొని జోబులో ఉంచుకొని) మీాబోటివాళ్ళతో యీా గున్నయ్య మెలుగుతున్నాడంటే ఆ మాత్రం తెలివి లేకుంటే మరేలాగండీ?

వెం: (సీరియస్‌గా) అరే-గం-డా -

గం: (అణుకువగా) చిత్తం అయ్యిగోరూ!

వెం: ఈ శవాన్ని తీసుకపొయ్యి యంత రహస్యంగా పారే సొస్తావో నీ యిష్టం!

గం: (సంతోషంగా చేతులో నోటు చూాచుకొంటూా) నూాత్తా రుగా సావేం - గండడంటే!

గు: అందుకనే కదంట్రా రెడ్డిగారు నీమీాందెంత నిగా వేం కథ.

గం: రెడ్డోరిమాట యగటాయించానంటే, యింకేం ఉంది గున్నయ్యగోరూ. పుల్లుగోడి గతి నాకు బట్టిందన్నా మాటే!

గు: కాకుండా, యింకేం అనుకొన్నావురా!

వెం: (గర్వంగా) హుః....కడుపులో బయంపెట్టుకొని బతికితే మీాకెందుకీ అగచాట్లొస్తాయిరా?

గం: అంతేగదంటయ్యిగోరూ!

గు: యిక నీపని నువ్వు జేసెయ్యిరా!

గం: (చేతిలో డబ్బును మొలగుడ్డలో బిగించి దోపుకొని ఉత్సాహంగా) యీణ్ణి చణంలో చెర్లో పారేశి రానంట గున్నయ్యగోరూ!

వెం: (రౌద్రంగా) అరే గండా—విషయం బైటికి పొక్కిందా (చేతిలో రివాల్వారు చూపి) నిలువునా ప్రాణం తీసేస్తా – ఆఁ –

గు: వాడికి మనం చెప్పాలటండీ! ఆ విషయం, వాడికీ తెలుసుగా!

గం: నాకు తెలీదంట గున్నయ్యసావేఁ, రెడ్డోరి సంగతే. నిల వనా పేగులు తీసెయ్యెడూ – అమ్మో! (పుల్లణ్ణి జవిరి పీపుమీా దేసుకొని జోబోతుంటాడు)

వెం: అరే గండా, అగురా – ఆగు. (గున్నయ్యకు సైగ జేస్తాడు)

గం: (భయంగా) ఏం, అయ్యగోరూ!

గు: (గబ–గబా రంగం వీడి కొన్ని క్షణాలకు ప్రవేశం) యిక జాగ్రత్తగాబోరా.

వెం: ఒక్క లగువున చెర్లో పారేశిరారా!

గం: చణంలో పారేశి రానంటయ్యగోరూ!

గు: రెడ్డిగారి బహుమానం దొరుకుద్దిరా!

గం: (భారంగా) రెడ్డోరిదయేగదంట, గు–న్న–య్యగోరూ! (రంగం వీడును.)

గు: అమ్మో! ఒక్క పీడ విరగడై పోయింది.

వెం: కాకుంటే యట్లాగయ్యా? వాడు బతికుంటే, ఏనాటికైనా మనకే ముప్పు. మనంజేసిన పన్లన్నీ బైటపడ్తాయనే ఉద్దేశంతో ప్రాణాలే తీసేశా. ఆఁ-ఏఁవంటావ్?

గు: అంతేగదండీ! మరి మీ తమ్ముడిగార్ని మీరే సంపించి బాయిలో వేయించారని ఆ దౌర్భాగ్యుడు ఆ సంఘం వాళ్ళతోనే చెప్పాడంటే యింకేమైనా ఉందా?

వెం: అందుకేగా నిలవనా కాల్చిపారేసింది!

గు: మంచిపనే జేశారు!

వెం: ఆ సుబ్బారెడ్డిని, నారదు కూతుర్ని శవాల్ని జేసేదాకా నా మనస్సుకు తృప్తి దొరకదు గున్నయ్యా -

గు: (సునాయాసంగా) ఆ సుబ్బారెడ్డిగాడెంతండీ! మన గండడికి ఒక వెయ్యిరూపాయిలు పారేశారంటే చాలు. వాణ్ణి రెండు తుండాలు జేసుకొచ్చి చూపడూ!

వెం: (నిరుత్సాహంగా) ఏఁటో! పిరికివెధవలు. తాటాకు చప్పుళ్ళకే బెదిరిపొయ్యే రకం -

గు: ఆఁ....పనిజేసుకొస్తేనేగా డబ్బు జారడం!

వెం: యధవడబ్బు పోతేపొయ్యింది. పనిజరిగితే చాలు!

గు: (పొగిడింపుగా) నాకు తెలీదటండీ, యీలాంటి విషయాల్లో డబ్బంటే మీకు మంచినీళ్ళ ప్రాయమేగా!

వెం: (గర్వంగా) యిలాంటి కార్యాలకు ఎంత సాహసమైనా చూపించాలి లేకుంటే మన పొరువు దెబ్బతింటుంది!

గు: అంతేగదంటండి మరి—

వెం: కాదు మనం బతికినన్నిరోజులూ మనల్నెదిరించేవా డుండగూడదు—

గు: మా తాతలనాటినుండీ యీగ్రామంలో పేరుబడ్డ సంస్థానం మీది. ఎవురు బ్రతికినా మీ చలవన బతకాల్సిందే. యిక మిమ్మల్నెదిరించి, గెలిచే యధవెవడండీ —

వెం: (కాలు కిందరాస్తూ) ఉండారుగా రౌడీ గాడిదలు—

గు: ఆ యధవలు నిలవనా ప్రాణాలు పోగొట్టుకొనే రోజులు సమీపించాయిలేండి !

వెం: (ఉత్సాహం జూపుతూ) అంతపనీ జరిగి నెరవేరిపొయ్యిం దంటే చాలు నీ కిస్తానని జెప్పిన బహుమానం గూడా ముట్టిపోతుంది—ఆఁ.

గు: (చేతులు నలుపుకొంటూ) ఏదో మీ దయలేండి !

వెం: నేను మాటతప్పేవాణ్ణిగాదని నీకు తెలుసుగా! నేను నీ కిస్తానన్న మొత్తం తప్పకుండా చెల్లిస్తా. అనుకొన్నా వేమొ – ఊఁ.

గు: ఆ యాశతో నేగదండీ యింతవరకూ నేను మీతో కలిసి అన్నిపన్లు జెయ్యడం !

వెం: నేనుమాత్రం కాదన్నానా—?

గు: ఆఁ...ఎంతమాటండీ, ధర్మమూర్తులు ఆడినమాట తప్పతారా అండీ?

వెం: అన్నమాట దక్కించుకోవడం, పట్టినపట్టు జరిపించుకోవడం మా లక్షణాలు.

గు: అమ్మో....నాకు తెలీకపొయ్యిందటండీ మీ పట్టుదల. తమ్ముడిగారి కేసులో ఎతిరేకంగా రికార్డు తయారు జేసిన సబ్బినస్పెక్టర్ని ఉద్యోగంనుండి బొత్తిగా ఊడ బెరికేయించారుగా!

వెం: హ్హాఁ-హ్హాఁ-హ్హాఁ-హ్హాఁ. నా కెతిరేకంగా రికార్డు నడిపిన వెధవప్రాణంతో యిడిపించానే-అనే చింత యిప్పటికీ ఉంది గున్నయ్యా నాకూ—

(మనుష్యుల కోలాహలం వినిపించి ఆగుతుంది)

వెం: (కంగారుగా) ఆఁ....ఏఁటా శబ్దం—

గు: (ఆదుర్దగా) అదేనండీ నాకూ బోధపడడంలేదు.

వెం: (దీమాగా) హుఁ....క్షణక్షణానికి అర్థంగాని విపరీతా లేవిఁటో?

గు: ఆ సుబ్బారెడ్డిగాడు, పుట్టురేపుల్లుబెట్టి, ఏం విపరీతాలు తీసుకొస్తాడోనని, భయంగానే ఉందండి. (మళ్లా బైట కోలాహలం).

వెం: (ఆందోళనగా) ఎవరైనా గండడ్ని చూచారా ఏం కర్మ?

గు: (భయంగా) ఐయుండొచ్చు అంతపనే జరిగుంటే ఇప్పుడు కర్తవ్యమేమిటబ్బా?—

వెం: (దిక్కు తెలీక) అదే నేనూ ఆలోచిస్తున్నా! (అరుపుల్తో మళ్లా కోలాహలం.)

గు: (వణికిపోతూ) ఏఁటండీ యీ విపరీతం. (రంగంపీడి కొన్ని క్షణాలకు వణుకుతూ తడబడుతూ)....

వెం: (ఆదుర్దగా) ఏఁటయ్యా ఆ రచ్చ?

గు: (తడబడుతూ) యింకేం ఉందండి ప్రాణాలుబొయ్యే పరి స్థితి సంభవించింది, యిక నేనేం జేసేదండీ?

వెం: (కొాద్రంగా) అసలు సంగతేవిఁటయ్యా!

గు: (తడబాటుతో) ఆ సంఘుపోళ్లు పుల్లుగోడి శవాన్నెత్తు కొని జనాన్ని పోగుజేసుకొని మనమింద కొొచ్చేస్తున్నా రండీ యిక నేనేం జేసేదండీ.

వెం: (పిచ్చిగా నవ్వి ధైర్యంగా చేతిలో రివాల్వరు ఊపుతూ) ఎందుకయ్యా అంతకంగారు?

గు: (దిక్కులు జూస్తూ) ఏఁటోనండీ అసలు నన్ను వాళ్లు ఊపిరితో ఉంచుతారా అని?

వెం: (సీరియస్‌గా) భయపడకయ్యా! నా సంగతి నీకు తెలుసు గదూ పిరికివాళ్ళనిజూస్తే తగనిమంటని – (బైట కోలా హలం.)

గు: వచ్చేస్తున్నారు, యిక నేనేం జేసేది? బైటికిపోతే పట్టు కొంటారు, యిక్కణ్నేవుంటే ఎట్లయినా సంపేస్తారు, యింతకూ యీ వేళ నా ప్రాణానికి నూకలు తీరాయి.

వెం: (కోపంగా) హుఁ....యింత పిరికివందవని నేను కల్లో గూడా అనుకోలే, అంతా మేకపోతు గాంభీర్యం, యిప్పుడు తెలిసింది.

గు: ఏఁవైనా అనండి, పేదవాడ్ని, కడుపు జరక్క మీా స్నేహితాని కొొప్పుకొన్నా ... యింతకూ వాళ్ళ చేతుల్లో నేనేం ఐపోతానో!

[మేడ వరండాలో తలుపులు పగలగొట్టి కోలాహలం జేసుకొంటూ వచ్చే రొద]

వెం: ఆఁ....(ధైర్యంగా) తలుపులు పగలగొట్టేశారు గాడిద కొడుకులు____

గు: (క్రుంగిపోతూ) యిక నేనేం జేసేదో, నాకు దారేది. (దిక్కు తెలీక ఒక మూల కళ్ళుమూసుకొని భయంగా కూర్చుంటాడు.)

[కోలాహలం సమీపిస్తున్న దిక్కున సాటుగా నక్కి రివాల్వరు గురిపెట్టి నాలుగు తోటాలు పేలుస్తాడు లోపల శబ్దాలు 'అబ్బా, అయ్యో' అమ్మా దొంగచాటుగా కాల్చాడు ద్రోహుడు, అని లోపల కొందరు అరుస్తారు. వీరయ్య ధైర్యంగా రంగంలోకి దూకి చేతులోనున్న కత్తితో, తోటాలైపోయి నిస్సహాయుడై రివాల్వరుతోనున్న వెంకట్రామిరెడ్డిని తల పగలగొడతాడు. రెడ్డి కిందబడి తన్నుకలాడుతుంటాడు, యీ దృశ్యాన్ని చూచిన గున్నయ్య, వెఱ్ఱికేకేసి ప్రాణాలిడుస్తాడు. విశ్వనాథరెడ్డి, సుబ్బా రెడ్డి, నారయ్య మెంయ్యలేక మోస్తూ, గోవిందరెడ్డిని, కాంతమ్మను కొన ప్రాణంతో, రంగస్థలంమీద పడుకోబెడతారు. కాంతమ్మ, గోవిందరెడ్డి ఒకరొన్నొకరు చూచుకొని పిచ్చిగా నవ్వుకొంటారు. గోవిందరెడ్డి కాంతమ్మ చెయిదీసుకొని గుండెమీదేసుకొని]

గో: జాతిలేని మానవప్రేమ మనది, కానీ అనుభవించడానికి మనకీ లోకం దూరమైపొయ్యింది కాంతం!

[మాటలు రాక చిరునవ్వుతో ప్రాణాలిడుస్తుంది కాంతం. వెంటనే గోవిందరెడ్డి ప్రాణాలిడుస్తాడు. దూరాన్నుండి పాట.]

యీ మానవ మారణపాలన
యిక పేదల దుర్భరశోకం
యీ దానవ గరళపు లోకం
రణరంగపు మృత్యువు నాదం
పగనాగుల పన్నాగంలో
మరణించెను నీతీ, న్యాయం.
ధరగమ్మెను చీకటి వెలుగు
యీ రక్తపు చేరుల చితిగా!!!

[తెర]